జ్ఞాని పురుష్ దాదా భగవాన్ నిర్వచించిన

# మృత్యు సమయం,

## దానికి ముందు దాని తర్వాత...

జననం అనేది జరిగినప్పుడు మృత్యువు కూడా ఉంటుంది!

ఈ జనన మరణాలు ఆత్మకు సంబంధించేవి కావు!

ఆత్మ శాశ్వతమైనది.

Telugu

జ్ఞాని పురుష్ దాదా భగవాన్ నిర్వచించిన

# మృత్యు సమయం,

# దానికి ముందు

# దాని తర్వాత...

మూల గుజరాతి సంకలనం - డా.నీరు బెహన్ అమీన్

తెలుగు అనువాదం - మహాత్మగణం

**ప్రకాశకులు** : అజీత్ సి.పటేల్
దాదా భగవాన్ విజ్ఞాన్ ఫౌండేషన్
1, వరుణ్ అపార్ట్‌మెంట్, 37,శ్రీమాలి సొసైటీ
నవరంగ్‌పురా పోలీస్ స్టేషన్ ఎదురుగా,
నవరంగ్‌పురా, అహ్మదాబాద్ – 380009
గుజరాత్, భారత్
**ఫోన్:** + 91 79 3500 2100



**First Edition** : November 2023 (500 copies)

**భావ మూల్యం** : 'పరమ వినయం', మరియు "నాకు ఎంతమాత్రం తెలియదు. అదే భావన

**Price** : Rs. 30

**ముద్రిక** : అంబా మల్టి ప్రింటింగ్
B–99, ఈల్కెట్రానిక్స్ GIDC
క–6, రోడ్డు సెక్టర్–25
గాంధీనగర్ – 382044
గుజరాత్, India
**ఫోన్:** +91 79 3500 2142

ISBN No: 978-93-91375-85-0

**Printed in India**

# త్రిమంత్రం

(సర్వ విఘ్న నివారణ చేసే మంత్రం)





నమో అరిహంతాణం

నమో సిద్ధాణం

నమో ఆయరియాణం

నమో ఉవజ్ఝాయాణం

నమో లోయే సవ్వ సాహూణం

ఏసోపంచణమోక్కారో,

సవ్వాపావప్పణాసణో

మంగళా ణం చ సవ్వోసిం,

పడమం హవయీ మంగళం

ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో శివాయ

జై సచ్చిదానంద





# దాదా భగవాన్ ఎవరు?

అది జూన్ 1958 లో ఒక సాయంత్రం సమయం సుమారు 6:00, ప్రదేశం రద్దీగా ఉన్న సూరత్ పట్టణ రైల్వే స్టేషన్‌లో ప్లాట్‌ఫార్మ్ నం. 3.లో బెంచీ మీద కూర్చునివున్న శ్రీ అంబాలాల్ మూల్జీ భాయ్ పటేల్ అనే దేహమందిరంలో, ప్రకృతిపరంగా, అక్రమ రూపంలో, ఎన్నో జన్మలుగా వ్యక్తమయ్యేందుకు ఆత్రుతగా ఎదురుచూస్తున్న 'దాదా భగవాన్' పూర్ణ రూపంలో ప్రకటితమయ్యారు, ఆధ్యాత్మిక అద్భుతంలా. ఒక గంట సమయంలోనే ఆయనకు విశ్వ దర్శనం అయింది. "నేనెవరు? భగవంతుడు ఎవరు? విశ్వాన్నంతా ఎవరు నడిపిస్తున్నారు? కర్మ అంటే ఏమిటి? ముక్తి అంటే ఏమిటి?" ఇలాంటి ప్రపంచంలో ఆధ్యాత్మిక ప్రశ్నలన్నిటికీ సమాధానం వచ్చింది. ఈ విధంగా దైవం, విశ్వానికి సంబంధించిన ఒక అద్వితీయమైన పూర్ణ స్వరూప దర్శనం కావించింది, దాని ఫలస్వరూపమే శ్రీ అంబాలాల్ మూల్జీ భాయ్ పటేల్, గుజరాత్‌లోని చరోతర్ క్షేత్రంలోని భాదరణ్ గ్రామంలో పాటీదార్, ఒక కాంట్రాక్ట్ పని చేసే వ్యక్తి, అయినా కూడా సంపూర్ణ వీతరాగ పురుషుడు.

"వ్యాపారంలో ధర్మం పాటించాలి కాని, ధర్మాచరణలో వ్యాపారం చేయగూడదు" అనే సిద్ధాంతంతోనే ఆయన జీవితమంతా గడిపారు. ఆయన ఎప్పుడూ ఎవరి దగ్గరి నుంచీ డబ్బు తీసుకోలేదు సరికదా తన ఆదాయం నుంచే తీర్థయాత్రలు చేసే భక్తులకు ఆర్థిక సహాయం చేసారు.

ఆ విధంగా ఆయనకు కేవలం రెండు గంటలలోనే సిద్ధించిన అద్భుతమైన జ్ఞానాన్ని ఉపయోగించి, ఆయన ఎందరో ముముక్షువులకు ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించారు. దాన్ని ఆయన అక్రమ మార్గం అని అన్నారు. అక్రమ అంటే ఒక క్రమం లేని అర్థం. క్రమం అంటే ఒక మెట్టు పైన మరో మెట్టుని క్రమంగా ఎక్కుతూ వెళ్ళటం. అక్రమ మార్గమంటే షార్ట్‌కట్‌లో లిఫ్ట్ ద్వారా పైకి చేరుకోవటం.

ఆయన "దాదా భగవాన్ ఎవరు" అన్న రహస్యాన్ని స్వయంగా చెప్తూ, "మీ ముందు కనిపిస్తున్న ఈ ఆకారం దాదా భగవాన్ కాదు. ఈయన ఎ.ఎమ్.పటేల్. మేము ఒక జ్ఞానపురుషుడను, లోపల ప్రకటితమైనది దాదా భగవాన్. దాదా భగవాన్, 14 లోకాలకు నాధుడు. ఆయన మీలో కూడా ఉన్నాడు. అందరిలోనూ ఉన్నాడు. మీలో అవ్యక్త రూపంలో ఉన్నాడు, నాలో సంపూర్ణ రూపంలో వ్యక్తమై ఉన్నాడు. ఆ దాదా భగవాన్ గారికి నేను కూడా ప్రణామం చేస్తాను"



# విజ్ఞప్తి

జ్ఞానిపురుషుడు దాదా భగవాన్ శ్రీముఖం ద్వారా, ఆధ్యాత్మిక, వ్యావహారిక జ్ఞానం ప్రకటితమైంది. దాన్ని రికార్డ్ చేసి, సంకలనం చేసి, ప్రకాశకులుగా పుస్తక రూపంలో ప్రచురించటం జరుగుతూవుంది. విభిన్న విషయాల మీద వెల్లడైన సరస్వతి వాణీ సంకలనం ఈ పుస్తకంలో ముద్రితమైంది. ఇది కొత్త పాఠకులకు ఒక వరప్రసాదమే అనుకోవచ్చు.

ప్రస్తుతం జరిగిన ఈ అనువాదంలో, దాదాజీ వాణినే వినిపిస్తున్నట్లుగా రాయటం జరిగింది. దానివలన కొన్నిచోట్ల విషయాలు మళ్ళీ మళ్ళీ చెప్తున్నట్లు, వ్యాకరణం సరిగ్గా లేనట్లు మీకు అనిపించవచ్చు. కాని ఇక్కడ చెప్తున్న సూత్రాలను, రాసిన ఉద్దేశ్యాన్ని దృష్టిలో పెట్టుకుని చదవమని ప్రార్థన. అప్పుడే ఎక్కువ ప్రయోజనాన్ని పొందగలుగుతారు.

పరమ పూజ్య దాదాశ్రీ చెప్పిన విషయాలను ఎక్కువ స్పష్టంగా పాఠకులకు అర్థమవటం కోసమే కొన్ని పదాలను చేర్చటం జరిగింది. కొన్ని చోట్ల ఇంగ్లీషు పదాలకు తెలుగు అర్థాలను రాయటం, దాదాశ్రీ చెప్పిన మాటల్లో దొర్లిన గుజరాతీ పదాలను ఇటాలిక్స్‌లో రాయటం జరిగింది. ఎందుకంటే అటువంటి పదాలకు సమానమైన తెలుగు పదాలు లేవు.

జ్ఞానిపురుషుడు చెప్పిన మాటలను తెలుగు భాషలో యథాతథంగా పాఠకులకు అందజేసే ప్రయత్నం జరిగింది. కానీ దాదాశ్రీ ఆత్మజ్ఞాన బోధ గుజరాతీ భాషలోనే సంపూర్ణంగా లభిస్తుంది. ఇంకా లోతైన జ్ఞానాన్ని పొందాలని, బోధలో ఉపయోగించిన పదాల మర్మాన్ని పూర్తిగా ఛేదించాలనుకున్నవారు, గుజరాతీ భాషను నేర్చుకోమని మా విన్నపం.

అనువాదంలోని లోపాలకు క్షమించవలసిందిగా ప్రార్థిస్తున్నాము.



# సంపాదకీయం

మనిషికి అన్నిటికన్నా ఎక్కువ భయం కలిగించేది మృత్యుభయం. ఆ ఆలోచనే దుఖాన్ని కలుగజేస్తుంది. ప్రతివారు ఎప్పుడో ఒకప్పుడు ఇతరుల మరణాన్ని చూడవలసివస్తుంటుంది. అటువంటి సమయంలో మరణం గురించిన ఆలోచనలెన్నో ముసురుకుంటూవుంటాయి. అసలీ మరణం అంటే ఏమిటి అనే ప్రశ్న ఉదయిస్తుంది. కానీ ఆ రహస్యాన్ని ఛేదించలేక పోవటంతో ఆ ఆలోచనలు ముందుకెళ్ళకుండా అక్కడే ఆగిపోతాయి. మృత్యు రహస్యాన్ని తెలుసుకునేందుకు మాత్రం ప్రతివారికీ ఆసక్తివుంటుంది. మరణం గురించి ఎన్నో రకాలుగా వినటం, చదవటం జరుగుతుంటుంది, ఇతరుల దగ్గరి నుంచి ఎన్నో విధాల వివరణ లభిస్తుంటుంది.

ఏమిటీ మృత్యువు అంటే? మృత్యువు ఆసన్నమవటానికి ముందు ఏం జరుగుతుంది? మృత్యు సమయంలో ఏం జరుగుతుంది? మృత్యువు కబళించిన తర్వాత ఏమవుతుంది? మరణానుభవాన్ని ఎవరు వివరించగలరు? తీరా మరణం సంభవించిన తర్వాత ఆ మనిషి ఎవరికి తన అనుభవాన్ని చెప్పగలుగుతాడు? జన్మ తీసుకోవటానికి ముందు పరిస్థితి కూడా తెలియదు. అలా జన్మకి ముందు, మృత్యువు తర్వాత పరిస్థితి ఎవరికీ తెలియదు. అందువలన, మృత్యువుకి ముందు, మృత్యు సమయంలోను, మృతి చెందిన తర్వాత ఎటువంటి పరిస్థితులు ఎదురౌతాయన్న విషయంలో ఉన్న రహస్యం రహస్యంగానే మిగిలిపోతూవస్తోంది. దాదాశ్రీ తన జ్ఞానదృష్టితో చూసిన ఈ రహస్యాలను మనకు సవివరంగా వెల్లడిచేసారు.

మృత్యువు గురించిన రహస్యం తెలియగానే దాని గురించిన భయం పటాపంచలం అవుతుంది.

మనకు బాగా కావలసినవారి మరణ సమయంలో మనం ఏం చెయ్యాలి? ఆ సమయంలో మనం చేయవలసిన బాధ్యత ఏమిటి? అందరినీ వీడిపోతున్న వాళ్ళ గతిని ఎలా మెరుగుపరచాలి? మనవాళ్ళు మృతిచెందిన తర్వాత మనం ఏం చెయ్యాలి? ఏ జ్ఞానంతో మనం సమతౌల్యతను పాటించాలి?

అనుసరించే విధులు, తంతులు ఇంకా ఎన్నో ఉన్నాయి- శ్రాద్ధం, 13వ రోజు, బ్రహ్మభోజనం, దానం, గరుడ పురాణం మొదలైనవి. వాటిని ఎంతవరకు నమ్మవచ్చు?

చనిపోయినవారికి నిజంగా ఏమేం అందుతాయి? అవన్నీ ఆచరించాలా వద్దా? ఈ విధమైన మరణానంతర గతి, స్థితి మొదలైన విషయాల గురించి ఇందులో స్పష్టంచేయటం జరిగింది.

అలా భయోత్పాదన కలిగించే మరణం గురించిన రహస్యం వెల్లడైనప్పుడు మనిషికి అటువంటి సమయంలో, తన జీవితంలో జరిగిన సంఘటనల విషయంలో ప్రశాంతత కచ్చితంగా లభిస్తుంది.

పరమజ్ఞానులు అంటే ఎవరంటే, తన శరీరం, అన్ని భౌతిక అవస్థలకు, జన్మ నుంచి, మృత్యువు నుంచి తమను తాము విడిగా చూసుకునేవారు. వాళ్ళ ఎల్లప్పుడు జ్ఞాతలుగానే జీవనాన్ని సాగిస్తూవుంటారు, ఆది, అంతం అనేవే లేని ఆత్మ స్వరూపులుగానే చరిస్తుంటారు. జన్మించటానికి ముందు, జన్మించిన తర్వాత, దేహాంతం వరకు జననం మరణం లేని ఆత్మ స్వరూపం ఎలాంటిది అన్న విషయాన్ని జ్ఞానియైనవారు తమ జ్ఞానదృష్టితో చూసి, అతి స్పష్టంగా మనకు విశదీకరిస్తారు.

ఆత్మ ఎప్పుడూ జనన మరణాలకు అతీతమైనది అన్నదే కేవలజ్ఞాన స్వరూపం. అదే కేవలజ్ఞాత దృష్టి. జన్మ, మృుత్యువు అనేవి ఆత్మకు వర్తించవు. అయినా బుద్ధి ద్వారా జనన మరణ పరంపర మనిషికి అనుభవంలోకి వస్తుంది. అలాంటప్పుడు సహజంగానే మౌలికమైన ప్రశ్న ఉదయిస్తుంది– జనన మరణాలు ఎలా కలుగుతాయి అని, అటువుంటి సమయంలో ఆత్మతోపాటు ఇంకేమేమి ఉంటాయి అని. అవి ఏమైపోతాయి? పునర్జన్మ ఎవరికి జరుగుతుంది, ఎలా జరుగుతుంది? అలా ప్రయాణం సాగించేది ఎవరు? చేసిన కార్యాలనుబట్టి కారణం, కారణాన్నిబట్టి కార్యం పరంపరలుగా ఎలా జరుగుతుంటాయి? దాన్ని నిలిపివేయటం ఎలా? ఆయుష్షు అనేది ఏవిధంగా మనకు లభిస్తుంది, అది దేని ఆధారంగా నిర్ణయించబడుతుంది? ఇటువంటి సనాతన ప్రశ్నలకు సమాధానాలను ఒక మహా జ్ఞాని తప్ప మరెవరు ఇవ్వగలుగుతారు?

ఇంకా ముందుకెళ్తే, ఈ చక్రబంధంలోకి ఏ చట్టం ద్వారా ప్రవేశిస్తాం? ఆత్మహత్యలు ఎందుకు చేసుకుంటారు, దాని పరిణామమెలా వుంటుంది? ప్రేతయోని అంటే ఏమిటి, భూతయోని అంటే ఏమిటి? క్షేత్ర పరివర్తనకు ఎలాంటి నియమాలు వర్తిస్తాయి? గతులలో భిన్నత్వానికి కారణమేమిటి? ఈ చక్రంలోనుంచి బయటపడటమెలా? మోక్షప్రాప్తి చెందిన

ఆత్మ ఎక్కడికి పోతుంది? సిద్ధగతి అంటే ఏమిటి? ఈ విషయాలన్నిటినీ ఈ పుస్తకంలో స్పష్టంగా చెప్పటం జరిగింది.

ఆత్మస్వరూపం, అహంకార స్వరూపాల గురించిన సూక్ష్మం ఒక జ్ఞానికి తప్ప ఎవరికి అర్థమౌతుంది?

చనిపోయిన తర్వాత మరోసారి మరణం రాకుండా ఉండాలంటే, మరోసారి జన్మనెత్తకుండా ఉండాలంటే, అటువంటి దశకు చేరుకునేందుకు అవసరమైన అన్ని విషయాల మీద సూక్ష్మజ్ఞానాన్ని సంకలనం చేయటం జరిగింది. ఇవన్నీ పాఠకులకు ప్రాపంచిక, ఆధ్యాత్మిక ప్రగతికి ఉపకరిస్తాయి.

జై సచ్చిదానంద

**–డా.నీరు బెహన్ అమీన్**

## దాదా భగవాన్ నిర్వచించిన

# మృత్యు సమయం, దానికి ముందు దాని తర్వాత...

### జనన మరణాల నుండి విముక్తి

**ప్రశ్నకర్త:** జనన మరణాల గోల నుండి విముక్తి ఎలా కలుగుతుంది?

**దాదాశ్రీ:** మంచి ప్రశ్న. మీ పేరేమిటి?

**ప్రశ్నకర్త:** చందూ భాయ్.

**దాదాశ్రీ:** నిజంగా చందూ భాయేనా?

**ప్రశ్నకర్త:** ఔను.

**దాదాశ్రీ:** చందూ భాయ్ అనేది మీ పేరు ఔనా?

**ప్రశ్నకర్త:** ఔను.

**దాదాశ్రీ:** అయితే మరి మీరెవరు? మీ పేరైతే చందూ భాయ్. అది మేమందరం ఒప్పుకుంటాం కాని, అసలు మీరెవరు?

**ప్రశ్నకర్త:** దాని గురించే వచ్చాను.

**దాదాశ్రీ:** మీకు అది అర్థమైనప్పుడు మీకు జనన మరణ బంధం నుంచి విముక్తి లభిస్తుంది.

ఇప్పటి వరకూ అంతా ఆ చందూ భాయ్ పేరు మీదనే జరుగుతూవస్తోంది కదా! అంతా చందూ భాయ్ పేరు మీద! అరె, మోసం జరిగిపోతుంది. మీరు కొంచెమైనా మీ పేరు మీద ఉంచుకోవలసింది కదా!

అస్థిత్వమంటే ప్రకృతి చేసే జప్తు. అది ఎలాంటి జప్తు అంటే, మీ పేరు మీదున్న బ్యాంక్ బ్యాలెన్స్ కాస్తా జప్తు అయిపోయింది. మీ పిల్లలు కూడా ఆ జప్తులోకే పోయారు. మీ భవంతి జప్తు అయింది. మీరు వేసుకున్న దుస్తులు కూడా జప్తు అయిపోయాయి. అన్నీ జప్తులోకే పోయాయి. అప్పుడు అడుగుతారు, "అయ్యా, మరి నేను నాతో ఏం తీసుకెళ్ళాలి" అని. అప్పుడు మీకు చెప్తారు, "నువ్వు ఇతరులతోపాటు పెన వేసుకున్న ముళ్ళను మాత్రం తీసుకునిపోవచ్చు" అని. అందువలన మీ పేరు మీద ఉన్నవన్నీ జప్తు అయిపోతాయి కనుక, మన కోసం మనమేమైనా చేసుకోవాలా, వద్దా?

## వచ్చే జన్మ కోసం మూటకట్టి పంపించుకో

మన బంధువులు కాని వాళ్ళకి, ఇతరులకు ఏమైనా ప్రయోజనం కలిగించినట్లయితే, తిరిగి వాళ్ళకి ఏమైనా చేసినట్లయితే అది మీకు అక్కడికి చేరుతుంది. మీ దగ్గరిబంధువులకి కాదు వేరేవాళ్ళకి! ఇక్కడ మీరు మందులను ఉచితంగా పంచిపెట్టారనుకో, ఔషధ దానం, అన్నదానం, లేక జ్ఞానదానం లేదా అభయదానం చేసినట్లయితే అవన్నీ అక్కడికి చేరుకుంటాయి. వీటిలో ఏమైనా ఇతరులకు ఇస్తావా లేక అంతా నీవే తినేస్తుంటావా?

వెంట తీసుకునేపోవాలి అంటే, ఒక మూడు లక్షల అప్పు చేసి వెళ్ళిపోతే సరి! ధన్యులైపోతారు. ప్రపంచం అలాగే ఉంది. అందుకే ఏమీ తీసుకెళ్ళలేకపోతున్నారు. అదే మంచిది.

## అంతా మాయా ప్రభావం

జన్మ తీసుకోవటం మాయ ఆడిన లీల, పెళ్ళి చేసుకోవటం మాయ, మరణించటం కూడా అంతే. మీకు ఇష్టమున్నా లేకపోయినా, తప్పదు, తప్పించుకోలేరు! అయితే చిన్న షరతు

ఏమిటంటే, మాయా సామ్రాజ్యమేమీ లేదు– మీరే యజమాని! అంటే మీ ఇచ్ఛానుసారమే అంతా జరిగింది. పూర్వ జన్మలో మీకున్న ఇచ్ఛల బాపతు ఖాతాను తెరిచి, దాని ప్రకారమే మాయ నడిపిస్తుంది. అందువలన ఇప్పుడు దాని గురించి గొడవపెట్టుకుంటే నడవదు. మాయకి మనమే మన లెక్కలను అప్పగించాం.

## జీవితం ఒక బందిఖానా

**ప్రశ్నకర్త:** మీ ఉద్దేశ్యంలో జీవితం అంటే ఏమిటి?

**దాదాశ్రీ:** నా ఉద్దేశ్యంలో జీవితం ఒక జైలు! జైళ్ళు నాలుగు రకాలుగా ఉంటాయి. ఆజీవన ఖైదు. దేవీ దేవతలు దృష్టి ఖైదులో ఉన్నారు, మనుషులేమో సాధారణ ఖైదులో ఉన్నారు. జంతువులు అత్యంత కాయకష్టం చేసే జైలులో ఉన్నాయి. నరకమనేది ఆజీవన ఖైదు.

## జన్మించిన దగ్గరి నుంచే మీద వేటు పడుతూనేవుంది

ఈ మన శరీరం క్షణక్షణం మరణిస్తూనేపోతుంటుంది కాని, ఈ విషయం మనుషులకు తెలియదాయె! కట్టెను గొడ్డలితో కొట్టినపుడు అది రెండు ముక్కలై కిందపడ్డప్పుడే అది కట్ అయింది అని అంటారు కాని, దాని మీద గొడ్డలి వేటు ఎప్పటి నుంచో పడుతూనేవుంది కదా!

## మృత్యు భయం

అసలీ ప్రపంచమే నిత్యం భయాలతో కూడుకునివున్నది. భయమనేది లేని ప్రపంచం కాదు ఇది. భయం లేదు అని అనుకుంటున్న సమయంలో జీవుడు నిజానికి అపస్మారంలో ఉంటాడు. కళ్ళు తెరిచి నిద్రపోతున్నారు కాబట్టే అంతా ఇలా నడుస్తోంది.

**ప్రశ్నకర్త:** ఆత్మకు చావులేదని, అది ఎప్పుడూ జీవించే ఉంటుందని అంటారు!

**దాదాశ్రీ:** ఆత్మకి చావులేదన్నది నిజమే కాని, మీరు ఆత్మస్వరూపులయేంతవరకు మీకు భయమనేది కలుగుతూనేవుంటుంది కదా– మరణ భయం! శరీరంలో కాస్త నొప్పి

కలుగగానే, "చచ్చిపోతానేమో" అనే భయం మొదలౌతుంది. దేహం మీద దృష్టే లేకపోతే తనకు తాను మరణించటం అనేది ఉండదు. కాని, "ఇదే నేను. ఇది నేనే" అనే భావన మీకు 100% ఉంది. మీకు, "ఇది చందూ భాయ్. అదే నేను" అన్న విషయంలో నూరుశాతం నమ్మకంగా ఉన్నారు కదూ!

## యమరాజా, నియమరాజా?

మన భారతదేశంలో ఉన్న అపోహలన్నిటినీ నేను తీసేస్తాను. దేశమంతా ఈ అపోహలలోనే కొట్టుకుంటోంది. యమధర్మరాజు అనే జంతువేమీ లేదని నేను మీకు హామీ ఇస్తున్నాను. "మరి ఏం జరుగుతుంది? ఏదో ఒకటి ఉండాలిగా" అని ఎవరైనా అడిగితే, అది "నియమరాజు" అని నేనంటాను. అయితే ఇది నేను చూసి చెప్తున్నానేకాని, ఎక్కడో చదివింది మీకు చెప్పటంలేదు. నేను నా చర్మచక్షువులతో కాదు, నా జ్ఞానదృష్టితో చూసి చెప్తున్నాను.

## మరణం తర్వాత ఏం జరుగుతుంది?

**ప్రశ్నకర్త:** మృత్యువు తర్వాత స్థితి ఎలా ఉంటుంది?

**దాదాశ్రీ:** జీవితకాలమంతటిలోను చేసిన పనంతా, జీవితకాలమంతా ఇక్కడ చేసిన వ్యాపారవ్యవహారాలు, వీటన్నిటి లెక్కలు మరణం తర్వాత తేలుతాయి. మరణించటానికి ఒక గంట ముందు ఆ పద్దులన్నీ ముందుకు వస్తాయి. హక్కులేనివాటిని అనుభవించినవారు, ఇతరుల దగ్గరి నుంచి డబ్బు, స్త్రీలను లాక్కున్నవారు, విచక్షణారహితంగా హక్కులేనివి తీసుకున్నవారు, వాటన్నిటినీ ఏ విధంగా దోచుకున్నా సరే వాళ్ళంతా ఉంటారు ఇందులో, వాళ్ళందరికీ లభించేది జంతు జన్మే. జీవితాంతం సత్ప్రవర్తనను కలిగివున్నట్లయితే మనిషి జన్మ వస్తుంది. మరణానంతరం కలిగే స్థితులు నాలుగు రకాలుగా ఉంటాయి. తన స్వార్థం కోసం పొలాలలో గ్రామస్తుల కుప్పలను కాల్చినవారు ఉంటారు కదా! అటువంటివాళ్ళకి స్థానం నరకంలోనే. అపకారికి కూడా ఉపకారం చేసినవారు మానవాతీతులై, దేవతాలోకాలకు చేరుకుంటారు.

## యోగం, ఉపయోగం పరోపకారార్థమే నీ సామర్థ్యాలను ఉపయోగించు

మనోవాక్కాయ కర్మలను, ఆత్మను ఇతరుల ప్రయోజనార్థం చేయి. నీవు నీకోసమే చేసినట్లయితే ఖిరనీ (ఒక చెట్టు) జన్మనెత్తుతావు. ఇక 500 సంవత్సరాలు అలాగే గడుపుతావు. నీ ఫలాలను జనం తింటారు, నీ నుంచి తీసిన కర్రలు, చెక్కలను కాలుస్తారు. ఒక ఖైదీలాగా నిన్ను ఉపయోగించుకుంటారు. అందుకే భగవానుడు ఇలా అన్నాడు, "నీ మనోవాక్కాయ కర్మలను, ఆత్మను, ఇతరుల కోసం ఉపయోగించు" ఒకవేళ నీకేమైనా కష్టమొస్తే నన్నడుగు!

## తర్వాత ఎక్కడికి వెళ్తారు?

**ప్రశ్నకర్త:** దేహాన్ని వదిలివెళ్ళినవారు మళ్ళీ తిరిగి రావలసివుంటుందా?

**దాదాశ్రీ:** ఎక్కడికీ పోవలసిన పనే లేదు. ఇక్కడే ఉండిపోతావు. నీ చుట్టుపక్కల కట్టేసివున్న ఆవులు, గేదెలు, సమీపంలో కనిపిస్తున్న కుక్క, ఇవన్నీ మనల్ని గుర్తిస్తాయి. వాళ్ళలో మన మామలు, పెద్దనాన చిన్ననాన్నలు, అంతా ఇక్కడే ఉన్నారు. అందువలన వాటిని ఎప్పుడూ కొట్టకు. వాటికి తిండి పెట్టు. వాళ్ళంతా నీ సమీప బంధువులే. మిమ్మల్ని నాకుతుంటారు. మీరు విసర్జించింది నాకుతుంటారు.

## రిటర్న్ టికెట్

**ప్రశ్నకర్త:** మధ్యలో ఆవు, గేదెల జన్మెందుకు వస్తుంది?

**దాదాశ్రీ:** అనంతమైన జన్మల తర్వాత వచ్చిన మనుషులంతా ఆ ఆవు, గేదెల నుంచి వచ్చినవాళ్ళే. మళ్ళీ ఇక్కడి నుంచి వెళ్ళినవాళ్ళలో పదిహేను శాతం వదిలిపెట్టి, మిగతావాళ్ళంతా తిరుగు ప్రయాణానికి టిక్కెట్టు తీసుకునివచ్చినవారే. అలా అక్కడికి తిరిగిపోయేందుకు టిక్కెట్లు ఎవరెవరు తీసుకునివచ్చారు? కల్తీలు చేసేవాళ్ళు, తమ హక్కు లేనిదాన్ని ఇతరుల దగ్గరి నుంచి దోచుకున్నవారు, హక్కులేనిదాన్ని అనుభవించినవారు, హక్కులేకుండా పొందినవారంతా జంతుజన్మను ఎత్తుతారు.

## పూర్వజన్మల మరపు

**ప్రశ్నకర్త:** మనకు పూర్వజన్మల గురించి జ్ఞాపకమెందుకు ఉండదు? ఒకవేళ అది గుర్తుంటే ఏమౌతుంది?

**దాదాశ్రీ:** అవి ఎవరికి జ్ఞాపకముంటాయో తెలుసా? చనిపోయేటప్పుడు అందుకు ఏమాత్రం దుఃఖించనివారికి, ఇక్కడ సత్ప్రవర్తనతో మెలిగినవారికి, వాళ్ళకి అన్నీ గుర్తుంటాయి. ఎందుకంటే తల్లి గర్భంలోనే ఎంతో వేదనను అనుభవిస్తారు. దానితోపాటు మృత్యు సమయంలోని వేదన కూడా దుఃఖాన్ని కలుగజేస్తుంది. ఈ రెండూ ఉంటాయి కనుక ఆ వ్యక్తి ఆ దుఃఖాల కారణంగా పశ్చాత్తాపానికి తావు ఉండదు కనుక ఏదీ గుర్తుండదు.

## అంతిమ సమయంలో మూటకట్టుకునే ప్రయత్నం వద్దు

ఎనభై సంవత్సరాల బాబాయి ఉండేవాడు. అతన్ని హాస్పిటల్‌లో చేర్చారు. అతను రెండు మూడు రోజుల్లో చనిపోతాడని నాకు తెలుసు. కాని నాతో, “మగన్ భాయ్ నన్ను కలవటానికి రాలేదు” అంటాడు. అప్పుడు నేను, “మగన్ భాయ్ అయితే వచ్చాడు” అని అంటే, “మరి నగీన్ దాస్ విషయం ఏమిటి?” అని అడిగాడు. అంటే, మరణశయ్య మీద ఉండి కూడా ఎవరెవరు వచ్చారు రాలేదు అన్నది లెక్కపెట్టుకుంటున్నాడన్న మాట! రెండు మూడు రోజుల్లో ఎలాగూ పోవలసినవాడే. ముందు నువ్వు నీ మూట సర్దుకో. నువ్వు ఇక్కడి నుండి తీసుకుపోగలవాటిని సమీకరించుకో. ఎవరో నగీన్‌దాస్ రాకపోతే నీకేంటి?

## జ్వరం వచ్చింది, అంతే ఇక అంతా అయిపోయింది

ముసలాయన ఆరోగ్యం బాగోలేకపోతే డాక్టర్‌ని పిలిపించారు, అన్ని రకాల వైద్యాలు చేసారు, అయినా మరణించాడు. సరే, శోకాన్ని ప్రదర్శించేవాళ్ళుంటారు కదా, వాళ్ళు మేమున్నామని భరోసా ఇవ్వటానికి వస్తారు. “అయ్యో ఏమైంది పెద్దాయనికి?” అని అడుగుతారు. అప్పుడు మీరంటారు, “ముందు మలేరియా వచ్చినట్లు అనిపించింది. కానీ, డాక్టర్లు అది ఫ్లూ అని చెప్పారు” అంటారు మీరు. “అలాగా, ఏ డాక్టరుకి చూపించారు?” అని అడుగుతారు.

మీరు ఆ డాక్టరు పేరు చెప్తారు. అప్పుడు వాళ్ళు, "నీకు బుద్ధుందా? ఫలానా డాక్టరుని పిలవాల్సింది" అంటారు. మరొకరు వచ్చి మిమ్మల్ని తిట్టేస్తారు, "ఇలా చేయవలసింది కదా, పిచ్చివాడిలా మాట్లాడుతున్నావు" అంటూ. అలా రోజంతా మిమ్మల్ని అందరూ ఏదో ఒకటి అంటూనేవుంటారు. అంతా మీ మంచితనాన్ని ఆసరాగా తీసుకొని, మీ మీద మాటలదాడి చేస్తారు. అందువలన, రెండవ రోజు మిమ్మల్ని పలకరించటానికి మనుషులు వస్తే వాళ్ళకేం చెప్పాలో మీకు చెప్తాను- "బాబాయికి చిన్న జ్వరం వచ్చి చనిపోయారు అంతే. ఇంకేం కాలేదు" వాళ్ళడిగినంత వరకే జవాబు చెప్పండి. విశదీకరించటం మొదలుపెట్టారో, ఇక అంతే ఇరుక్కుపోతారు. అందువలన, "జ్వరం వచ్చి పోయారు అంతే" అంటే చాలు వాళ్ళకి కావలసిన సమాధానం దొరుకుతుంది.

## స్వజనుల అంతిమ సమయంలో వారిని చూసుకోవటం

**ప్రశ్న కర్త:** ఎవరైనా మనవాళ్ళకు అంతిమ సమయం దగ్గరకు వస్తే, దగ్గరి బంధువులంతా వచ్చి ఎలా ప్రవర్తించాలి?

**దాదాశ్రీ:** అంతిమ సమయం వచ్చినవారిని జాగ్రత్తగా చూసుకోవాలి. వాళ్ళు చెప్పే ప్రతి మాటను జాగ్రత్తగా వినాలి. వాళ్ళనే దానికి వ్యతిరేకంగా మాట్లాడవద్దు. వాళ్ళని సంతోషంగా ఉంచాలి. వాళ్ళు మాట్లాడింది తప్పయినా సరే, "ఔను బాగా చెప్పారు" అనాలి. వాళ్ళు "పాలు తీసుకునిరా" అంటే వెంటనే పాలు తీసుకెళ్ళి ఇవ్వాలి. ఇవి బాగ పల్చగా నీళ్ళలా ఉన్నాయి. వేరే తీసుకునిరా" అంటే వెంటనే వేరే పాలు వేడి చేసి తీసుకువచ్చి, "ఇవి మంచివి, శుద్ధమైనవి" అని చెప్పాలి. అంటే, మన ప్రవర్తన వాళ్ళకి అనుకూలంగా ఉండాలి. అలాగే ఆ వ్యక్తి దగ్గరున్నవాళ్ళ అందరి ప్రవర్తన, మాటలు అలాగే ఉండాలి.

**ప్రశ్నకర్త:** అంటే చెప్పేది తప్పో ఒప్పో అన్నదేమో పట్టించుకోవద్దు!

**దాదాశ్రీ:** తప్పొప్పులనేవి ఈ ప్రపంచంలో లేనే లేవు. వాళ్ళకి నచ్చితే చాలు. అందరూ అలాగే మాట్లాడటం, వాళ్ళకి అనుకూలంగా ప్రవర్తించటం చేయాలి. చిన్న పిల్లల దగ్గర

మనం ఎలా ఉంటాం? ఏమీ తెలియని రెండు సంవత్సరాల బిడ్డ గాజు సామానుని పగలగొడితే మనం ఏం చేస్తాం? ఎందుకలా చేసావ్ వగైరా వగైరా అంటూ వాళ్ళని కోప్పడతామా? అలాంటి చిన్న పిల్లలతో ఎలా ఉంటామో అలాగే ఉండాలి.

## అంతిమ క్షణాల్లో ధర్మబోధ

**ప్రశ్నకర్త:** లామాల అంతిమ క్షణాలలో కొన్ని రకాల క్రియలను చేస్తారు. ఏం చెప్తారంటే, టిబెట్ లామాలు మరణశయ్య మీద ఉన్న వ్యక్తి ఆత్మతో "నువ్వు ఈ విధంగా వెళ్ళు" అని సూచిస్తారు. మాలో భగవద్గీత చదువుతారు లేదా కొన్ని మంచి వాక్యాలను వినిపిస్తారు. చివరి సమయంలో అలా చెయ్యటం వలన దాని ప్రభావం వాళ్ళ మీద ఏమైనా పడుతుందంటారా?

**దాదాశ్రీ:** ఏమీ ఉండదు. సంవత్సరం పొడవునా 12 నెలల ఖాతా పుస్తకాన్ని రాసి, ధన్‌తేరస్ రోజున లాభనష్టాలు తేల్చి చూపిస్తే అది చెల్లుబాటు అవుతుందా?

**ప్రశ్నకర్త:** అలా కుదరదు.

**దాదాశ్రీ:** ఎందుకని?

**ప్రశ్నకర్త:** అది సంవత్సరం మొత్తం మీద చూడవలసింది కదా.

**దాదాశ్రీ:** అలాగే జీవితమంతటి ఖాతా ఇది. అది మోసం చెయ్యటమౌతుంది. మనుషుల్ని మూర్ఖులను చెయ్యటం.

**ప్రశ్నకర్త:** దాదాజీ, మనిషి అంత్య సమయంలో జాగృదావస్థలో ఉన్నపుడు భగవద్గీత పఠిస్తే, లేక ఇతర శాస్త్ర గ్రంథాలు చదివి వినిపిస్తే లేదా అతని చెవిలో కొన్ని.....

**దాదాశ్రీ:** ఒకవేళ అతను అడిగితే, స్వయంగా కోరుకుంటే తప్పక చెయ్యాలి ఆ పని.

## మెర్సి కిల్లింగ్

**ప్రశ్నకర్త:** ఎక్కువ వేదనను అనుభవిస్తుంటే వాళ్ళని అలాగే అనుభవించనీయాలా? వాళ్ళని చంపేస్తే మిగిలిపోయిన ఆ వేదనను మరుజన్మలో అనుభవించవలసివుంటుంది అన్నది సరిగ్గా అనిపించటం లేదు. శారీరకంగా మరీ ఎక్కువ బాధని అనుభవిస్తున్నట్లయితే, దాన్ని అంతం చేయటంలో తప్పేముంది?

**దాదాశ్రీ:** అలా చేసే అధికారం ఎవరికీ లేదు. చికిత్స చేసే అధికారం మాత్రమే మనకి ఉంటుంది, వాళ్ళకి సేవచేసే అధికారం ఉంటుంది. అంతేకాని, ఎవరినీ చంపే అధికారం లేదు.

**ప్రశ్నకర్త:** ఇక అందులో మనం చేసిన మంచి ఏముంది?

**దాదాశ్రీ:** అంటే చంపేయటం మంచి పనా? ఎంతో బాధపడుతున్న ఆ వ్యాధి పీడితుడిని చంపితే ఆ మనిషి చచ్చిపోతాడు, అది మానవతా దృక్పథంలో మంచిపని కాదు, విరుద్ధమైన పని.

## వెంట వెళ్ళేది స్మశానం వరకే

ఈ దిండు ఉంది కదా, దాని గలీబు మారుతుంటుంది కాని, దిండు అదే, అలాగే వుంటుంది. గలీబు చినిగిపోతుంది, మారిపోతుంది. అదేవిధంగా మన ఈ తొడుగు కూడా మారిపోతుంటుంది.

లేకపోతే ఈ ప్రపంచం ఎలా ఉంటుందో ఆలోచించండి. అయితే ఎంత దుఖం ఉన్నా, వ్యవహారం వరకు వచ్చేసరికి అలా ఉండదు. స్మశానం వరకు వెళ్ళినవారెవరూ అక్కడే చింతతో పడిపోలేదు. కుటుంబంలోని వాళ్ళంతా తిరిగి ఇంటికి వచ్చేస్తారు. ఈ విషయంలో అందరూ తెలివైనవారే. ఆ వ్యక్తి తల్లి ఉన్నా, ఆమె కూడా ఏడ్చుకుంటూనే తిరిగివచ్చేస్తుంది.

**ప్రశ్నకర్త:** తనకేమీ ఇవ్వకుండా పోయాడని హృదయంలో రోదన మొదలౌతుంది. అదే ఒక లక్ష రూపాయలు వదిలివెళ్ళివుంటే మాత్రం ఏమీ అనదు.

**దాదాశ్రీ:** ఔను. అంతే. తన గురించి ఏమీ వదలకుండా పోతేనే ఎక్కువ ఏడుపు వస్తుంది, "చచ్చిపోయాడు, నన్ను చంపిపోయాడు" అని. లోలోపల, "ఆస్తి ఏమీ ఇవ్వకుండా పోయాడు, మమ్మల్ని దెబ్బతీసాడు" అని మనసులో అనుకుంటారు. ఆ వ్యక్తి ఏమీ తన వెనక ఏమీ వదలకుండా పోయాడంటే అది అతని భార్య దౌర్భాగ్యం. అయితే చనిపోయినవాడి ఖాతాలో వీళ్ళ తిట్లు తినటం ఉన్నది కాబోలు. అందుకే ఎన్నో మాటలు వినవలసివస్తుంది.

స్మశానానికి వెళ్ళినవాళ్ళు తిరిగి రారా లేక వాళ్ళంతా తిరిగివస్తారా? ఇది ఒక రకమైన నాటకమే. ఏడ్చినా తంటాయే, ఏడవకపోయినా తంటాయే. ఎక్కువగా రోదిస్తే, "ప్రపంచంలో ఎవరూ చనిపోరా? మీరింతలా ఏడవాలా అదే చోద్యం?" అంటారు. ఏడవకపోతేనేమో, "మీది గుండేనా లేక బండరాయా" అంటారు. అంటే ఏం చేసినా తప్పే. అంతా శాస్త్రప్రకారం జరగాలి" అని అంటారు.

అక్కడ స్మశానంలో కాల్చివస్తారు, పక్కనే ఉన్న హొటల్లో కూర్చుని టీ సమోసా తింటారు. అంతే కదా అలాగే చేస్తారు కదా!

**ప్రశ్నకర్త:** ఫలహారం తీసుకునే వెళ్తారు కదా!

**దాదాశ్రీ:** ఏమంటున్నారు? అంటే ప్రపంచమంతా అలాగే ఉంది. ఇలాంటి ప్రపంచం మీకు ఎలా బాగుంది?

విషయంలోనైనా సంబంధం పెట్టుకుంటారు కాని, అంతా తలకెక్కించుకోరు. మీరు ఏమైనా తలకెక్కించుకుంటారా? భార్య విషయంలో అయినా వేరెవరి విషయంలోనైనా?

**ప్రశ్నకర్త:** లేదు.

**దాదాశ్రీ:** అదేంటి అలా మాట్లాడుతున్నారు? భార్యను పక్కను కూర్చోబెట్టుకుని, "నువ్వు లేకపోతే నాకు ఏదీ బాగుండదు" అంటారే మరి, స్మశానంలో వాళ్ళతో పాటు పోరు కదా! పోతారా?

## తద్దినం రోజు

**ప్రశ్నకర్త:** కుటుంబంలో ఎవరిదైనా చనిపోయిన రోజు వస్తే ఆరోజు కుటుంబంలోని వారు అందరూ ఏం చేయాలి?

**దాదాశ్రీ:** గతించినవారికి మంచి చేయమని భగవంతుని ప్రార్థించాలి.

## స్థిరమైన చోటు ఎక్కడా ఉండదు

**ప్రశ్నకర్త:** చనిపోయినవారు ఇప్పుడు ఎక్కడ ఉన్నారు అన్నది ఎలా తెలుసుకోవాలి?

**దాదాశ్రీ:** అది చూడాలంటే అందుకు తగు జ్ఞానం ఉండాలి. దివ్యజ్ఞానంతోనే చూడవచ్చు. అయితే, అలా తెలుసుకున్నా, దానివలన ప్రయోజనమేమీ ఉండదు. కాని, మనలోని భావన మాత్రం వాళ్ళకు చేరుతుంది. వాళ్ళని గుర్తుచేసుకున్నా, వాళ్ళ గురించిన భావన వచ్చినా అది వాళ్ళ వరకు చేరుకుంటుంది. అదంతా జ్ఞానంతో తప్ప మరేవిధంగాను తెలియదు కదా!

నీకు ఎవరి గురించైనా తెలుసుకోవాలా? మీ కుటుంబంలో ఎవరైనా పోయారా?

**ప్రశ్నకర్త:** నా సొంత తమ్ముడే ఎక్స్‌పైర్ అయ్యాడు.

**దాదాశ్రీ:** అతను నిన్ను గుర్తు చేసుకోవటం లేదు కానీ నీవు మాత్రం అతన్ని గుర్తుచేసుకుంటున్నావు. ఎక్స్‌పైర్ అవటం అంటే ఏమిటో తెలుసా? ఖాతా పుస్తకంలో లెక్కలు పూర్తవటం. తర్వాత మనం ఏం చెయ్యాలి? ఒకవేళ ఆ వ్యక్తి బాగా గుర్తుకొస్తున్నట్లయితే, వీతరాగ భగవానునికి, "అతని ఆత్మకు శాంతిని ప్రసాదించండి" అని ప్రార్థించాలి. అంతకంటే మనమేం చెయ్యగలం?

## అల్లా సొత్తు

మీరు అడగదలచుకున్నది అడగండి. అల్లా దగ్గరకు పోయి అడిగేందుకు మీకేమైనా అడ్డంకులుంటే నన్ను అడగండి. మేము ఆ అడ్డంకిని తొలగిస్తాము.

**ప్రశ్నకర్త:** నా కొడుకు దుర్ఘటనలో చనిపోయాడు. ఆ దుర్ఘటనకు కారణమేమిటంటారు?

**దాదాశ్రీ:** ప్రపంచంలో కంటికి కనిపించేవి, చెవులకు వినిపించేవి అన్నీ 'రిలేటివ్ కరెక్ట్' అవుతాయి. అవి వాస్తవాలు కావు. ఈ శరీరం కూడా మనది కాదు. అలాంటప్పుడు కొడుకు మాత్రం మనవాడు ఎలా అవుతాడు? లౌకికంలో ఉండబట్టి లోకవ్యవహారాన్ని అనుసరిస్తూ అలా భావిస్తాము అంతే. మన దగ్గర ఉన్నవి, ఉన్నంత వరకు మనవి, మిగతావన్నీ

పరాయివి. అందువలన కొడుకుని నీ కొడుకుగా భావిస్తున్నంత కాలం మనోవేదన, మనసులో అశాంతి తప్పవు. ఇక ఇప్పుడు కొడుకు లేడు కనుక మీకు ఇష్టమైతే 'లెట్ గో' అనుకోండి.

**ప్రశ్నకర్త:** అది సరే అనుకోండి, అల్లా సొత్తు అల్లా తీసుకెళ్ళిపోయాడు.

**దాదాశ్రీ:** అంతే అంతే! ఈ తోటంతా అల్లాదే.

**ప్రశ్నకర్త:** వాడి మరణం ఆవిధంగా జరిగిందంటే అందులో మేము చేసిన దుష్కర్మల ఫలితమేమైనా ఉండివుంటుందా?

**దాదాశ్రీ:** ఉంటుంది. మీ పాపాలు, మీ కొడుకు చేసిన ధుష్కర్మ ఫలితం ఉంటుంది. సుకర్మలు చేస్తే దాని ఫలితం మంచిగా ఉంటుంది.

## భావ స్పందన మాత్రమే చేరుకుంది

కొడుకు చనిపోయినందుకు దుఃఖిస్తే, అతనికీ దుఃఖం కలుగుతుంది. అజ్ఞానం కారణంగా మనుషులు ఆవిధంగా చేస్తారు. అందువలన, 'ఎలా జరగాలో అలా జరిగిపోయింది' అని తెలుసుకొని ప్రశాంతంగా ఉండాలి. ఎందుకు అనవసరంగా మనసులో బాధనుపెట్టుకోవటం? కొడుకు చనిపోని ఇల్లే ఉండదు. అదంతా ఋణానుబంధం, ఇచ్చిపుచ్చుకొనే లెక్కల వ్యవహారమే. మా దగ్గర కూడా కొడుకులు కూతుళ్ళు ఉండేవాళ్ళు. వాళ్ళు మరణించారు. అతిథుల్లా వచ్చారు, ఆ అతిథులు తిరిగి వెళ్ళిపోయారు. మనదంటూ ఏముందిక్కడ? ఏం మీరు మాత్రం పోరా? మీరు కూడా వెళ్ళిపోతారు కదా మరి ఎందుకీ వ్యర్థ వేదన? జీవిస్తూవున్నవాళ్ళకి మనశ్శాంతినివ్వు. పోయినవాళ్ళు పోయారు కనుక వాళ్ళని గుర్తుచేసుకోవటం మానెయ్యి. మీమీద ఆధారపడివున్నవాళ్ళకి ప్రశాంతతను కలుగజేయి. అదైతే మీ బాధ్యతే. పోయివాళ్ళ గురించి బాధపడుతూ, ఉన్నవాళ్ళకి మనశ్శాంతి లేకుండా చెయ్యటం ఏమిటి? అందరూ అలాగే తమ బాధ్యతలను సరిగ్గా నెరవేర్చకుండా ఉంటారు. అలాగే అనిపిస్తుంది కదా! జేబులో పెట్టుకున్న లక్షరూపాయలు పోయాయి, దొరకనే లేదు అనుకోండి, ఏం చేస్తారు? తలబద్దలు కొట్టుకుంటారా ఏమిటి?

మనచేతిలో ఉన్నది కాదు పైగా, మీవలన పాపం పోయినవాడికి అక్కడ కూడా దుఃఖం కలుగుతుంది. మనమిక్కడ వాళ్ళ గురించి దుఃఖిస్తుంటే ఆ భావన అక్కడ వాళ్ళ దగ్గరికి

చేరుతుంది. అలా వాళ్ళనీ ప్రశాంతంగా ఉండనీయరు, మీరూ ప్రశాంతంగా ఉండరు. అందుకే వేదాంత పండితులు, "పోయినవాళ్ళ గురించి దుఃఖించవద్దు" అంటారు. అందుకోసమే ఈ గరుడ పురాణాన్ని చూడు, ఫలానా గ్రంథాన్ని చదువు, పూజ చేయి, మనస్సులోంచి వాళ్ళ మీద ఆలోచనను తీసివేయి అని చెప్తారు. మీరు అవేమైనా చేసివున్నారా? అయినా దుఃఖం పోలేదా?

**ప్రశ్నకర్త:** కాని, నేను వాడిని మర్చిపోలేకపోతున్నాను. మా తండ్రీ కొడుకుల మధ్య సంబంధం చాల బాగుండేది. అందువలన అదంతా మరచిపోయేటట్లుగా లేదు.

**దాదాశ్రీ:** ఔను మరచిపోయటట్లుగా ఉండదు. కానీ మీరు అతన్ని మర్చిపోలేకపోతే మీకు దుఃఖం కలుగుతుంటుంది, దానివలన అక్కడ మీవాడికి కూడా దుఃఖం కలుగుతుంది. అందువలన మీ కొడుకు కోసం దుఃఖించటమనేది ఒక తండ్రిగా మీరు చేయవలసిన పని కాదు.

**ప్రశ్నకర్త:** అక్కడ వాడికి ఎలా దుఃఖం కలుగుతుంది?

**దాదాశ్రీ:** మీరిక్కడ దుఃఖపడుతూవుంటే దాని ఫలితంగా ఆ భావన అక్కడికి చేరుకుండా ఉండదు. ఈ ప్రపంచంలో అంతా టెలిఫోన్, టెలివిజన్‌లాగానే పనిచేస్తుంది. ఇక్కడ మనం బాధపడినంత మాత్రాన అతను తిరిగివస్తాడంటారా?

**ప్రశ్నకర్త:** రాడు.

**దాదాశ్రీ:** ఎలాగైనా రాలేడు.

**ప్రశ్నకర్త:** రాడు

**దాదాశ్రీ:** మనం దుఃఖిస్తే దాని ఫలితం కూడా అక్కడికి చేరుతుంది, ఇక్కడ మనం అతని పేరు మీద ధర్మకార్యాలు, భక్తితో కూడిన పనులు చేస్తే అది కూడా అతనికి చేరుతుంది, దానితో అతనికి శాంతి చేకూరుతుంది. అతనికి శాంతి చేకూర్చటమనేది మీకు ఎలా అనిపిస్తూవుంది? అలా అతనికి శాంతిని చేకూర్చటం మీ ధర్మం కాదా? అందువలన అతనికి

బాగుండే పని చేయగూడదూ? ఏదైనా ఒక రోజు స్కూలు పిల్లలకు ఏదైనా మిఠాయి తినిపించటం అలా ఏమైనా చేయవచ్చు.

మీకు మీ కొడుకు గుర్తుకొచ్చినపుడు, అతని ఆత్మకి అంతా మంచి జరగాలి అని కోరుకోండి. "కృపాలుదేవుని" నామస్మరణ చేయండి. "దాదా భగవాన్" పేరు తలచుకున్నా పరవాలేదు. ఎందుకంటే, ఆత్మపరంగా కృపాలదేవుడు, దాదా భగవాన్ ఒక్కరే కాని, భౌతిక ఆకారంలో వేరు వేరుగా కనిపిస్తారు. అంటే మహవీర్ భగవానుని మననం చేసుకున్నా అంతే. అతని ఆత్మకి శాంతి చేకూరాలి, మంచి జరగాలి అనుకుంటూ ఉండండి. మీరు అతనితో పాటు కలిసి జీవించారు, కలిసి భోజనం చేసారు కనుక, అతనికి ఏం చేస్తే ప్రయోజనకరంగా ఉంటుందో, ఆ భావనలో ఉండండి. మనం ఇతరుల గురించి మంచి అనుకుంటాం. అలాంటప్పుడు మన కుటుంబంలోని మనవాళ్ళ గురించి మంచి ఎందుకు తలవగూడదు?

## దేనికి ఏడుస్తున్నారు? మీ గురించా, పోయినవాళ్ళ గురించా

**ప్రశ్నకర్త:** మనవాళ్ళకు పూర్వజన్మ, పునర్జన్మల గురించి తెలుసుకదా! అయినా, ఇంట్లో ఎవరైనా చనిపోతే మనవాళ్ళు ఏడుస్తారెందుకు?

**దాదాశ్రీ:** అంతా వాళ్ళ వాళ్ళ స్వార్థం చూసుకుని ఏడుస్తారు. మరీ దగ్గర సంబంధీకుడైతే నిజంగా దుఃఖిస్తారు. కానీ మిగతా ఏడ్చేవాళ్ళందరూ వాళ్ళ వాళ్ళను తలచుకుని ఏడుస్తారు. ఇది కూడా ఎంతో ఆశ్చర్యకరమైన విషయమే కదా! అటువంటి వాళ్ళంతా భూతకాలాన్ని వర్తమానకాలంలోకి పట్టుకొచ్చేస్తారు. ఎంత గొప్పవాళ్ళు మన భారతీయులు! భూతకాలాన్ని ప్రస్తుతకాలంలోకి తీసుకువస్తారు, ఆ ప్రయోగం మనమీద చేస్తారు!

## కల్పాంతం పరిణామం

కల్పాంతం ఒకసారి చేయటం జరిగితే కల్పాంతం వరకు తిరుగుతూనేవుండాలి. దానివలన, కల్పం అంతమయ్యేంత వరకూ తిరుగుతూనేవుండవలసివుంటుంది.

## 'లీక్' చేసేది కాదు

**ప్రశ్న కర్త:** నరసింహ మెహతా, అతని భార్య చనిపోయినప్పుడు, "మంచిదే, పీడాపోయింది" అని ఎవరైనా అంటే దాన్ని ఏమనాలి?

**దాదాశ్రీ:** వాళ్ళు పిచ్చివాళ్ళలా, "మంచిదే, పీడాపోయింది" అని ఉంటారు. "పీడా వదిలి పోయింది" అనే విషయాన్ని మనసులో ఉంచుకోవాలి కాని, బయటకు 'లీక్' చేసేది కాదు. అయితే వాళ్ళ మనసులో అనుకున్నది ఎలాగో లీక్ అయ్యి బయటకు వచ్చింది. మనసులో పెట్టుకోవలసినదాన్ని బయటకు ప్రకటిస్తే వాళ్ళని పిచ్చివాళ్ళు లేక తెలివితక్కువ వాళ్ళనే అంటారు.

## జ్ఞాని వివేకంతో ప్రవర్తిస్తాడు

జ్ఞానం ఉన్నవాడు తెలివితక్కువగా ఎప్పుడూ ప్రవర్తించడు. వివేకంతో మెలగుతాడు. అతని మనసులోకి కూడా ఎన్నో ఆలోచనలు వస్తాయి. "మంచిదైంది పీడా వదిలిపోయింది" అనే ఆలోచన కూడా రావొచ్చు కాని అతను బయటకు, "అరెరె ఎంత పనైంది!" అంటాడు. నేను ఒంటరివాడినైపోయాను ఇప్పుడు ఏం చెయ్యను అని కూడా అంటాడు. నాటకాలాడుతాడు. అసలు ఈ ప్రపంచమే ఒక నాటకం. అందువలన లోపల, "మంచిదైంది పీడా వదిలిపోయింది" అనిపించినా, వివేకంతో ప్రవర్తించాలి. "మంచిదే అయింది గొడవ వదిలిపోయింది, గోపాలుని భజిద్దాం" అని మాత్రం అనగూడదు. అలాంటి అవివేకం బయటివాళ్ళు కూడా చెయ్యరు. శత్రువైనా సరే వివేకంతో కూర్చుంటాడు, ముఖం శోకంతో వేలాడేసుకునివుంటాడు. మనకి శోకం కాని మరేమీ ఉండదు. అయినా బాధ కనబరుస్తూ, నీళ్ళు చల్లి వచ్చి కూర్చుంటాం. ఇది అభినయమే. ద వర్ల్డ్ ఈజ్ డ్రామా ఇట్‌సెల్ఫ్ (ప్రపంచమే ఒక నాటకం). మీరు నాటకమాడాలి, నటించాలి. కానీ, ఆ నటనను సిన్సియర్‌గా చేయాలి.

## జీవుడు 13 రోజులు తిరుగాడుతుంటాడా?

**ప్రశ్నకర్త:** మరణించిన తర్వాత 13 రోజులపాటు రెస్ట్‌హౌస్ అవుతుందని అనవచ్చా?

**దాదాశ్రీ:** 13 రోజులు ఈ బ్రాహ్మణులకు ఉంటుంది. చనిపోయినవాడికేమిటి? అది రెస్ట్‌హౌస్ అని బ్రాహ్మణులంటారు. బొటనవేలంత అయిపోయి ఇంటి కప్పు మీద కూర్చుని, చూస్తూవుంటాడేమో. అరె, ఎందుకలా చూస్తుంటాడు? కాని చూడు వాళ్ళ గొడవంతా, గొడవంతా. బ్రొటనవేలంత ఉంటాడు, ఇంటి కప్పు మీద కూర్చునివుంటాడు అని అంటారు. మనవాళ్ళు

అది నిజమనుకుంటారు. అలా అనుకోకపోతే 13 రోజులు చెయ్యరు వీళ్ళు. అదే లేకపోతే 13 రోజులు మిగతా తంతులేమీ చెయ్యనే చెయ్యరు.

**ప్రశ్నకర్త:** గరుడ పురాణంలో, ఆత్మ బ్రొటన వేలంత అయిపోతుందని రాసివుంది.

**దాదాశ్రీ:** ఔనౌను. దాని పేరే గరుడపురాణం కదా. పురాణా (పాతది) అంటారు అందుకే. బ్రొటనవేలంత ఆత్మ కదా అందుకే మనకి అది మనకి ప్రాప్తించదు. రోజులు కూడా తిరిగిరావు. ఎవిరిడే ఫ్రైడే. సైంటిఫిక్‌గా చేద్దామనుకున్నారు, సైంటిఫిక్ కోసం చేసారు కానీ, ఆలోచనలే చెడిపోయాయి. వీళ్ళు ఆ పేరుతో కొన్ని తంతులు చేస్తారు. అలా తంతులను నిర్వహించే ముందు బ్రాహ్మణులకు దానమిస్తారు. దానమివ్వటానికి యోగ్యులు కూడా బ్రాహ్మణులే. బ్రాహ్మణులకు దానమిస్తేనే పుణ్యమొస్తుంది. ఇప్పుడిదంతా కకలావికలం అయిపోయింది. బ్రాహ్మణుడు అక్కడి నుంచి మంచం తీసుకెళ్తాడు. దాని బేరం ముందే అయిపోతుంది– ఇరవై రెండు రూపాయలకు నీకిస్తానని. పరుపు బేరం జరిగిపోతుంది, దుప్పటి బేరం జరిగిపోతుంది. మనమింకా చాలా ఇస్తాము– వస్త్రాలు, ఇతర సామానులు అలాంటివి. వాటన్నిటినీ కూడా అమ్మేస్తారు. అలా చేస్తే అదంతా ఆత్మకు చేరుతుందని మనుషులు ఎలా నమ్మేస్తారు?

**ప్రశ్నకర్త:** దాదాజీ, ఇప్పుడు ఎంతో మంది, “ఆ వస్తువులన్నీ నువ్వే తీసుకునిరా, మేము ఈ డబ్బు ఇస్తాము” అని రేటు నిర్ణయిస్తున్నారు.

**దాదాశ్రీ:** ఇప్పుడే కాదు, ఎన్నో సంవత్సరాల నుంచి అలా జరుగుతూవుంది. అనుకున్న డబ్బు ఇస్తాము, అవన్నీ నువ్వే తీసుకునిరా! అతను వేరేవాళ్ళు ఇచ్చిన మంచాన్ని తీసుకుని వస్తాడు. ఇప్పుడు చెప్పు! అప్పటికీ మనుషులకు అర్థం కాదు. బండి ఎలా నడుస్తూవుందో అలాగే నడవనీ! జైనులు అలా చేయరు. జైనులు ఏం చేసినా సరిగ్గా చేస్తారు కాని అలాంటిలాంటివి ఆచరించరు. అసలు అలాంటిలాంటివేమీ లేవు కూడా. ఇక్కడి నుండి ఆత్మ బయలుదేరి తన మార్గంలో పయనిస్తుంది, యోని ప్రాప్తిస్తుంది.

## చనిపోయినవాడికి ఒరిగేదేమీ ఉండదు

**ప్రశ్న కర్త:** ఎవరైనా చనిపోతే భజనలు కీర్తనలు చేయాలా వద్దా? దాని వలన ఫలితం ఏమైనా ఉంటుందా?

**దాదాశ్రీ:** చనిపోయినవాడికి దానివలన ఒరిగేదేమీ ఉండదు.

**ప్రశ్నకర్త:** అయితే మరి ఈ ధార్మిక విధులు, చనిపోయినప్పుడు చేసే కార్యక్రమాలు ఇవన్నీ సరైనవేనా కాదా?

**దాదాశ్రీ:** వాటిలో ఒక అక్షరం కూడా సరి కాదు. వాళ్ళు వెళ్ళిపోయారు అంటే వెళ్ళిపోయారు అంతే. మనుషులంతా తమంతట తామే చేస్తారు. ఒకవేళ, నీకోసం నువ్వు చెయ్యి అని అన్నా, లేదు నాకు ఖాళీ సమయం లేదు అంటారు. పోనీ నీ తండ్రి గురించి ఏమైనా చెయ్యి అన్నా కూడా చెయ్యరు. మనుషులు అలాగే ఉన్నారు. కానీ, ఇరుగుపొరుగువారు, "నీ తండ్రి కోసం చెయ్యి, నీ తండ్రి కోసం చెయ్యి" అని అంటూ బలవంతంగా చేయిస్తారు.

**ప్రశ్నకర్త:** మరి ఈ గరుడపురాణాన్ని మధ్యలోకి తీసుకునివస్తారు అదేమిటి మరి?

**దాదాశ్రీ:** అదేమిటంటే, గరుడపురాణం అయితే, ఏడ్చేవాళ్ళుంటారు కదా వాళ్ళు గరుడపురాణంలోకి పోతారు. అంటే మనశ్శాంతి కోసం ఉన్న మార్గాలలో ఒకటి.

## అదంతా మెచ్చుకోలు కోసం చేసేదే

**ప్రశ్నకర్త:** మరణించిన తర్వాత 12వ రోజు చేస్తారు, 13వ రోజు చేస్తారు, పాత్రదానం చేస్తారు, భోజనాలు పెడతారు, వీటి ప్రాముఖ్యత ఏమిటి?

**దాదాశ్రీ:** అదంతా అనివార్యం కాదు. అందరి మెచ్చుకోలు కోసం చేస్తారు. ఖర్చు చేయకపోతే వాళ్ళలో లోభం పెరిగిపోతుంది. రెండు వేల రూపాయలు ఇస్తే, దానితో తినటానికి, తాగటానికి ఖర్చుపెట్టరు. ఆ రెండు వేల రూపాయలను ఎలా పెంచాలా అని చూస్తారు. అందువలన ఆ విధంగా ఖర్చుపెట్టినట్లయితే మనసు నిర్మలమౌవుతుంది, లోభం పెరగకుండా ఉంటుంది. అయితే అది అనివార్యమేమీ కాదు. డబ్బులుంటే చేయండి, లేకపోతే వదిలేయండి పరవాలేదు.

## శ్రాద్ధానికి సరైన అర్థం

**ప్రశ్నకర్త:** శ్రాద్ధం పెట్టేటప్పుడు పితరులను ఆహ్వానించటం జరుగుతుంది. అది సరైన పద్ధతేనా? ఆ సమయంలో శ్రాద్ధ పక్షంలో పితరువులు వస్తారా? మరియు కాకికి భోజనం పెట్టారు, అది ఏమిటి?

**దాదాశ్రీ:** ఒకవేళ కొడుకుతో ఇంకా సంబంధం ఉంటే వస్తాడు. సంబంధం తెగిపోయిన తర్వాతనే దేహం చాలించటం జరుగుతుంది. ఇంటివాళ్ళతో ఇంకా ఏ సంబంధమూ మిగిలిలేదు కనుకనే దేహం వదిలేసారు. మళ్ళీ కొత్త సంబంధాలు ఏర్పడి జన్మ తీసుకోవటం జరుగుతుంది. అంతేకాని తిరిగి రాకపోకలు అనేవి ఏమీ ఉండవు. పిత్రువు ఎవరిని అంటారు? కొడుకుకి లేదా తండ్రికి? కొడుకు పిత్రువు అవుతాడు మరియు తండ్రి పిత్రువు అవుతాడు లేదా తాతా పిత్రువు అవుతాడు, ఎవరికి పిత్రువు అంటాము?

**ప్రశ్నకర్త:** గుర్తుచేసుకునేందుకే ఈ కర్మకాండలన్నీ పెట్టారు ఔనా?

**దాదాశ్రీ:** కాదు. గుర్తుచేసుకునేందుకు కూడా కాదు. వీళ్ళు, చనిపోయినవాళ్ళ పేరు మీద నాలుగు అణాలు కూడా ఖర్చుపెట్టే రకాలు కారు. అందువలన, “నీ తండ్రి చనిపోయారు కనుక, కొంత ఖర్చుపెట్టాలి, ఈయీ కర్మకాండలు చెయ్యాలి, అలా చేస్తే అదంతా నీ తండ్రికి చేరుతుంది” అని వాళ్ళకి నచ్చజెప్పారు. లోకులు కూడా తండ్రి కోసం ఏమైనా చేయాలి అని గట్టిగా చెప్తారు. శ్రాద్ధం పెట్టు! ఏదైనా మంచి చేయి! ఇలా చెప్పి రెండు మూడు వందల రూపాయలు శాస్త్రం పేరుతో ఏదైతే ఖర్చు పెట్టిస్తారో దానితో వాళ్ళకి లాభం చేకూరుతుంది. తండ్రి పేరు మీద చేస్తే ఆ తర్వాత దాని ఫలితం తిరిగివస్తుంది! అలా తండ్రి పేరుతో చేయమని చెప్పకపోతే వీళ్ళు నాలుగు అణాలు కూడా ఖర్చుపెట్టరు. అంటే గుడ్డి శ్రాద్ధంతోనే ఇదంతా నడుస్తూవుంది. మీకు అర్థమైందా లేదా?

వ్రతాలు, ఉపవాసాలు, ఆయుర్వేద సూత్రాల మీద ఆధారపడివుంటాయి. అలా వ్రతాలు, ఉపవాసాలు చేస్తే ఆయుర్వేదం ప్రకారం ఏం లాభం కలుగుతుంది? అందులో ఉన్న ప్రయోజనాలన్నీ కలుగుతాయి. మొదట్లో వాటిని ఆ శాస్త్ర ప్రమాణాలతో చూసారు. కానీ ఈ మూర్ఖులకు లాభం కూడా ఉండాలి కనుక, అష్టమి, ఏకాదశి, పంచమి అంటూ పెట్టారు, ఈ శ్రాద్ధమనేది కూడా తీసుకువచ్చారు. శ్రాద్ధం చాల మంచి ప్రయోజనంలోనే తీసుకువచ్చారు.

**ప్రశ్నకర్త:** దాదాజీ, శ్రాద్ధంలో కాకులకు భోజనం పెడ్తారు కదా దాని అర్థమేమిటి? అదంతా అజ్ఞానం అనవచ్చా?

**దాదాశ్రీ:** అజ్ఞానం కాదది. శ్రాద్ధ కర్మ అలాగే చేయాలని నేర్పటం జరిగింది. మా దగ్గరైతే శ్రాద్ధకర్మకి సంబంధించి ఒక చరిత్ర ఉంది. దానికి కారణం ఏమిటి? శ్రాద్ధకర్మలు మొదలయ్యేవి భాద్రపద శుద్ధ పౌర్ణమి నుంచి భాద్రపద అమావాస్య వరకు. దాన్ని శ్రాద్ధపక్షం (మహాలయ పక్షాలు) అంటారు. 16 రోజుల శ్రాద్ధం. ఈ శ్రాద్ధకర్మ ఆచారాన్ని ఎందుకు తీసుకువచ్చారు? ప్రజలంతా ఎంతో తెలివైనవారు. అందువలన శాస్త్రీయ ప్రమాణాలతో శ్రాద్ధ కర్మను మొదలుపెట్టించారు. భారత్‌లో గ్రామాలలో కొన్ని సంవత్సరాల క్రితం వరకు ప్రతి ఇంట్లో ఒక మంచం మీద పక్క ఎప్పుడూ వేసివుండేది. ఒకరిద్దరు మలేరియా కారణంగా మంచంపట్టివుండేవారు. అది ఏ నెలలలో తెలుసా? ఇదే భాద్రపద మాసంలో. అంటే, గ్రామాలకు వెళ్ళి చూస్తే, బయట ఒకటి రెండు మంచాలు వేసి వుండేవి, అందులో రోగులు కప్పుకుని పడుకుని ఉండేవారు. జ్వరం ఉంటే అది మలేరియా జ్వరమైవుండేది. భాద్రపద మాసంలో దోమలు ఎక్కువగా ఉండేవి కనుక మలేరియా బాగా వ్యాపిస్తుండేది. మలేరియాని పిత్త జ్వరం అనేవారు. అది వాయు (వాత) లేక కఫంతో కూడిన జ్వరం కాదు. పిత్త జ్వరంలో పిత్తము ఎంతో పెరిగిపోతుంది. వర్షాకాలంలో పిత్తజ్వరం వస్తుంది, దానికితోడు దోమకాటు ఎక్కువగా ఉంటుంది. పిత్తము ఎక్కువగా ఉన్నవాళ్ళనే అవి కుడతాయి. అందువలన మనుషులు, పరిశోధకులు, భారతదేశంలో అందుకు ఉపాయం వెతకాలి, లేకపోతే సగం జనాభా తరిగిపోతుంది అనుకున్నారు. ఇప్పుడు దోమలు తగ్గిపోయాయి. లేకపోతే మనుషులు జీవించివుండేవారు కాదు. అందువలన పిత్తం వలన వచ్చే జ్వరాన్ని తగ్గించాలనుకుని అలా తగ్గించేందుకు తరుణోపాయాన్ని కనుగొన్నారు. అదేమిటంటే, పాలతో చేసిన పదార్థాలు లేక పరమాన్నం, పాలల్లో పంచదార కలిపి సేవించినట్లయితే పిత్తం తగ్గిపోయి, మలేరియా నుంచి కొంత కాపాడుకోవటం జరుగుతుంది. ఈకాలపువాళ్ళు ఇంట్లో పాడివున్నా, పరమాన్నంలాంటివేమీ చేసుకోరు, పాల పదార్థాలేమీ చేసుకోరు. అలాంటివాళ్ళే. చాల నార్మల్ కదా! అంటే ఏం జరిగిందో తెలుసా? పాలపదార్థాలను రోజు తీసుకోవాలంటే ఎలా?

ఇక తండ్రి దగ్గరికి చిన్న అక్షరంముక్క కూడా చేరదు. అయితే వీళ్ళు కనుక్కున్నదేమిటంటే, భారతీయులు నాలుగణాల ధర్మం కూడా చేయరు. అలాంటివాళ్ళు కానేకాదు. రెండు అణాలు

కూడా దానమివ్వనంత లోభులు. అందువలన చెవిని పెడవైపు నుంచి పట్టుకుని, "నీ తండ్రికి శ్రాద్ధం పెట్టు" అంటూ చెప్తూవచ్చారు. అందుకే ఆవిధంగా శ్రాద్ధమనేది వచ్చింది. ఇక మొదలైంది. తండ్రికి శ్రాద్ధం పెట్టాలి కదా మరి! నాలాంటి మొండివాడు ఉండి, శ్రాద్ధం పెట్టకపోతే ఏమంటారు? "తండ్రికి శ్రాద్ధం కూడా పెట్టడు" అని అంటారు. ఇరుగుపొరుగులు చెవులు కొరుక్కుంటారు. అందువలన శ్రాద్ధం పెట్టేస్తాడు. తర్వాత భోజనాలు పెడతాడు.

దానితో పౌర్ణమి నుంచి తినటానికి పరమాన్నం దొరుకుతుంది. అలా పదిహేను రోజులూ పరమాన్నం లభిస్తుంది. ఎందుకంటే, ఒకరోజు మా ఇంట్లో, మరో రోజు మీ ఇంట్లో అలా. మనుషులలో ఇది ఆచారంలా తయారై, వంతుల ప్రకారం తినటం జరిగింది. దీనివలన పెద్ద నష్టమేమీ జరగదు. అంతేకాక ఆహారపదార్థాలను కాకులకు కూడా తినిపించాలి. ఇలాంటి ఉపాయాన్ని కనిపెట్టటం జరిగింది. దీనివలన పిత్తమంతా పోతుంది కనుక ఇలాంటి విధిని మొదలుపెట్టించారు. అందుకే మనవాళ్ళు ఏమనేవారంటే, పదహారు శ్రాద్ధాల తర్వాత బ్రతికివున్నాడు కనుకనే నవరాత్రులలో పాల్గొన్నాడు అని.

## సంతకం పెట్టకుండా మరణం కూడా సంభవించదు

ప్రకృతి నియమం ప్రకారం, ఏ మనిషినీ ఇక్కడి నుండి తీసుకెళ్ళటం జరగదు. చనిపోయేవాడి సంతకం లేకుండా ఏ మనిషినీ ఇక్కడి నుండి తీసుకెళ్ళటం జరగదు. మరి మనుషులు అందుకు సంతకాలు పెడతారా? "భగవంతుడా నన్ను ఇక్కడి నుండి తీసుకుపోతే బాగుండు" అంటారు కదా! వాళ్ళు ఎందుకు అలా అంటారు? తెలుసా మీకు? వాళ్ళకి ఎంతో దుఃఖం కలిగివుంటుంది, అందుకే, "ఈ శరీరం వదిలిపెడితే మంచిది" అనుకుంటారు. అదే క్షణంలో సంతకం పెట్టించుకోవటం జరుగుతుంది.

## దానికంటే ముందు నన్ను గుర్తుచేసుకో

**ప్రశ్నకర్త:** దాదా, ఆత్మహత్య చేసుకుంటే ఏడు జన్మల వరకు అలాగే జరుగుతుందని విన్నాను. అది నిజమేనా?

**దాదాశ్రీ:** మనకు అబ్బిన సంస్కారం ఏడు ఎనిమిది జన్మల వరకు కొనసాగుతుంది.

అందువలన ఎటువంటి కుసంస్కారాలను మీమీద పడనీయవద్దు. చెడు సంస్కారాల నుంచి దూరంగా పరిగెత్తండి. ఔను. ఇక్కడ ఎంత కష్టం ఎదురైనా వాటిని సహించాలి కాని, గుండుదెబ్బ తగలనీయకండి. ఆత్మహత్య చేసుకోవద్దు. బడౌదా పట్నంలో కొన్ని సంవత్సరాల క్రితం, ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తే, నన్ను గుర్తుచేసుకోండి, నా దగ్గరకు రండి అని అందరికీ చెప్పటం జరిగింది. అలాంటివాళ్ళుంటారు కదా, అఘాయిత్యాలకు పాల్పడేవాళ్లు, వాళ్ళకోసం చెప్పాను. వాళ్ళు నా దగ్గరకు వచ్చారు, వాళ్ళకు అర్థమయ్యేట్లు చెప్పేవాడిని. ఆ తర్వాత ఆత్మహత్య చేసుకోవాలనే ఆలోచన వాళ్ళలో తొలగిపోయేది. 1951 తర్వాత అందరికీ చెప్పిందేమిటంటే, ఎవరికైనా ఆత్మహత్య చేసుకోవాలనే ఆలోచన వస్తే నాదగ్గరకు రండి, ఆ తర్వాత చేసుకోండి. ఎవరైనా తనకి ఆత్మహత్య చేసుకోవాలని ఉంది అంటే వాళ్ళకి నచ్చజెప్పేవాడిని. అతని చుట్టూ అందుకు ఉన్న కాజెస్ (కారణాలు), అతని సర్కిల్ ఆత్మహత్య చేసుకునేటట్లుగా ఉందా అన్నది అతనికి అర్థమయ్యేట్లు చెప్పేవాడిని, అతన్ని తిరిగి ఆ ఆలోచన నుంచి వెనక్కి మళ్ళించేవాడిని.

## ఆత్మహత్య ఫలితం

**ప్రశ్నకర్త:** ఎవరైనా ఆత్మహత్య చేసుకుంటే అతనికి ఏ గతి సంప్రాప్తమౌతుంది?

**దాదాశ్రీ:** ఆత్మహత్య చేసుకున్నవారు ప్రేతాత్మలౌతారు, ప్రేతాత్మలా ఉండిపోయి తిరుగుతుంటారు. ఆత్మహత్య చేసుకుని ఇంకా కష్టాలపాలౌతారు. ఒకసారి ఆత్మహత్య చేసుకుంటే ఎన్నో జన్మల వరకు దాని ప్రతిస్పందన ఉంటుంది. ఈ ఆత్మహత్య చేసుకునేవాళ్ళంతా ఎవరో కొత్తవాళ్ళు కారు. పూర్వజన్మలో కూడా ఆత్మహత్య చేసుకునేవుంటారు, దాని ప్రతిస్పందనే ఈ జన్మలోది కూడా. ఇప్పుడు ఆత్మహత్య చేసుకుంటే అది పూర్వజన్మలో ఆత్మహత్య చేసుకున్నదాని ఫలితమే. అందువలన తనంతటతానే ఆత్మహత్యకు పాల్పడతాడు. ఆ ప్రతిస్పందన ఎలా తయారౌతుందంటే, అతను అలాగే చేస్తూపోతాడు. తనంతటతానుగా ఆత్మహత్యకు పాల్పడుతాడు, ఆత్మహత్య తర్వాత అవగతికి లోనవుతాడు. అవగతిలోని జీవి అంటే, దేహం లేకుండా తిరుగాడుతుండేవాడవుతాడు. భూతంలా చరించటం అంత సులభమేమీ కాదు. భూతమవటం దేవగతికి దారితీస్తుంది. అది అంత సులభంగా లభించదు. భూతమనేది ఇక్కడ కఠోర తపస్సు చేసైనా ఉండాలి లేదా అజ్ఞాన తపమైనా ఆచరించివుండాలి. అప్పుడే భూతంగా మారుతారు. అయితే ప్రేతాత్మ వేరు.

## వికల్పం లేకుండా జీవించటం సాధ్యం కాదు

**ప్రశ్నకర్త:** ఆత్మహత్య చేసుకోవాలనే ఆలోచన ఎందుకు వస్తుంటుంది?

**దాదాశ్రీ:** అటువంటివాళ్ళ అంతరంగంలోని వికల్పం సమాప్తమవుతుంది కనుక. వీళ్ళు వికల్పం ఉంటేనే జీవిస్తారు. వికల్పం అంతమైనప్పుడు ఇక ఇప్పుడు ఏం చేయాలి అన్నది వాళ్ళకి గోచరించదు. అందువలనే ఆత్మహత్య చేసుకోవాలనే ఆలోచన వస్తుంది. అంటే, వికల్పం కూడా మంచిపనే చేస్తుందన్నమాట!

ఆలోచనలు సహజసిద్ధంగా అంతమైనప్పుడు ఉన్నతమైన ఆలోచనలు వస్తాయి. వికల్పం ఆగిపోయినప్పుడు, సహజంగా వచ్చే ఆలోచనలు కూడా ఆగిపోతాయి. అంతా అంధకారంలా కనిపిస్తుంది. ఏమీ పాలుపోదు. సంకల్పం అంటే "నాది", వికల్పం అంటే "నేను". ఈ రెండూ లేనప్పుడు ప్రాణాలు తీసుకోవాలనే ఆలోచన వస్తుంది.

## ఆత్మహత్యకు కారణం

**ప్రశ్నకర్త:** ఆత్మహత్య చేసుకోవాలనుకొనే ఆలోచనకు మూల కారణమేమిటి?

**దాదాశ్రీ:** ఆత్మహత్య చేసుకోవాలనుకోవటానికి మూలకారణం, అతను ఏదో జన్మలో ఆత్మహత్య చేసుకునివుంటాడు. దాని ప్రభావం ఏడు జన్మల వరకు ఉంటుంది. ఇది ఎలాంటిదంటే, ఒక బంతిని మూడు అడుగుల పై నుంచి వదిలేస్తే అది పైకి లేచి రెండవసారి రెండున్నర అడుగుల వరకు ఎగిరి పడుతుంది. అలా అవుతుందా లేదా? పూర్తిగా మూడు అడుగుల వరకు పైకి ఎగరదు. దాని శక్తికొద్దీ రెండున్నర అడుగులు పైకి ఎగురుతుంది. మూడవసారి ఒక రెండు అడుగులు మాత్రమే పైకి లేచి కిందికి పడుతుంది. నాల్గవసారి కేవలం ఒక అడుగున్నర మాత్రమే పైకి ఎగిరిపడుతుంది. మరోసారి ఒక అడుగు వరకే పైకి ఎగురుతుంది. దాని కదలిక అలా ఒక నియమం ప్రకారం జరుగుతుంది. అదే విధంగా, ప్రకృతికి కూడా ఒక నియమం ఉంది. ఆత్మహత్య చేసుకునేవాళ్ళకు ఏడు జన్మల వరకు ఆత్మహత్య చేసుకుంటూనేవుండాల్సివస్తుంది. ఆత్మహత్య పరిణామ తీవ్రత ఎక్కువ తక్కువగా ఉండవచ్చు కానీ మనకు పూర్తిగా జరిగినట్లే కనిపిస్తుంది. తగ్గి తగ్గి, చివరకు పరిణామం పూర్తిగా అంతరిస్తుంది.

## ఆఖరి క్షణాలు

చనిపోయే సమయంలో జీవితంలో ఏమేం చేసారో ఆ జీవితసారమంతా ముందుకొస్తుంది. దాన్ని నలభైఐదు నిమిషాల వరకు చదువుకున్నతర్వాత శరీరానికో బంధం ఏర్పడుతుంది. అంటే, రెండు కాళ్ళు నాలుగు కాళ్ళు అవుతాయి, అన్నం తినేవాడు కాస్తా ఆకులు, మొక్కలను తినటానికి వెళ్తాడు. కలియుగంలో విశేషమిదే. చివరకు మళ్ళీ మనిషి జన్మ లభించటం దుర్లభమౌతుంది. అదే ఈ కలియుగంలో జరిగేది.

**ప్రశ్న కర్త:** అంతిమ సమయం వచ్చిందని ఎలా తెలుస్తుంది? ఒకవేళ చెవులు మూసుకుపోతాయా?

**దాదాశ్రీ:** అంతిమ సమయంలో ఆ రోజు మీ ఖాతాలో నిల్వ అంతా మీ ముందుకు వస్తుంది. మృత్యు గంటలో, అప్పటివరకు వచ్చిన మొత్తం ఫలితం కేవలం ఆ జన్మలోదే కాకుండా పూర్వజన్మల ఫలం, ఈ జన్మలో జోడించుకున్నవి కూడా వస్తాయి. ఆ మృత్యు ఘడియలో మనవాళ్ళు చెవిలో "రామనామం జపించు, రామనామం జపించు" అంటూ ఎంత రొదపెడతారు! రాముడినెందుకయ్యా పిలుస్తారు? ఆయన పోయి చాలా కాలమైంది!

అయితే మనకు అలా నేర్పించారు. అలా చెయ్యమని చెప్పారు. అయితే లోపల పుణ్యం జాగృతమైతే అది అడ్జస్ట్ అవుతుంది. కానీ అక్కడేమో కూతురు పెళ్ళి సమస్యే తిష్టవేసుకునివుంది. ముగ్గురు అమ్మాయిలకు పెళ్ళిళ్ళు చేసాడు, నాలుగో అమ్మాయి పెళ్ళి మిగిలిపోయి ఉంది. ఆ అమ్మాయికి చేసింది ముందుకు వచ్చి నిలబడుతుంది. చిన్నప్పుడు చేసిన మంచేమీ రాదు, కేవలం వృద్ధాప్యంలో చేసిన మంచే వస్తుంది.

## ప్రకృతి చేసిన చక్కని నియమం

ఇక్కడి నుండి వెళ్ళిపోవటమనే న్యాయం కూడా సృష్టిలో మంచిదే కదా! అయితే, వీతరాగులు మనలను హెచ్చరిస్తారు- బాబూ, నీకు యాభై ఏళ్ళు నిండాయి ఇప్పటికైనా జాగ్రత్తపడు!

ఒకవేళ ఆయుష్షు డెబ్భై ఐదు సంవత్సరాలైతే, యాభయ్యవ సంవత్సరంలో ఫొటో

తీయటం జరుగుతుంది, అరవై సంవత్సరాల ఆయుష్షుంటే నలభై సంవత్సరాల వయసులో ఫొటో తీయటం జరుగుతుంది. ఒకవేళ ఎనభై ఒక్క సంవత్సరాల ఆయుష్షుంటే యాభైనాలుగు సంవత్సరాలలో ఫొటో ఒకటి తీయటం జరుగుతుంది. కాని, ఈ లోపులో ఎంత ఫ్రీఆఫ్ కాస్ట్ (ఉచిత) టైం లభిస్తుందంటే, 2/3వ భాగం సమయం ఉచితంగా లభిస్తుంది, 1/3 వ భాగమేదైతో ఉందో దాని ఫొటో తీస్తుండటం జరుగుతుంది. ఈ నియమం బావుంది కదా, లేకపోతే బలవంతంగా పెట్టినట్లుందా? బలవంతంగా పెట్టినట్లేమీ లేదు కదా! న్యాయమనే అనిపిస్తోంది కదా! 2/3 భాగాల సమయంలో ఆటపాటలతో గడుపు పరవాలేదు కాని ఇప్పటికైనా సరిగ్గా ఉండు!

## అనుక్షణం భావమరణం

**ప్రశ్నకర్త:** మృత్యువు దేహానికే అంటారు కదా!

**దాదాశ్రీ:** అజ్ఞానమానవులు రెండు రకాల మరణాలను పొందుతారు. భావపరంగా రోజూ మరణిస్తూనేవుంటారు. అనుక్షణం భావమరణం, చివరకు భౌతిక మరణం సంభవిస్తుంది. అయితే, నిత్యం కలిగే మరణం వలన ప్రతిరోజు దుఃఖమే. అనుక్షణం భావ మరణం! అందుకే కృపాలదేవులు ఇలా అన్నారు–

*"క్షణక్షణ భావ మరణే కాం అహో రాజీ రహో?"*

(అనుక్షణం జరిగే భావ మృత్యువు, అరె ఎందుకు ప్రసన్నంగా ఉన్నారు?)

వాళ్ళంతా జీవిస్తున్నారు అంటే ఎందుకు, మరణించటానికేనా లేక మరెందుకు?

## సమాధి మరణం

అందువలన మనం మృత్యువుతో, "నీవు త్వరగా రావాలనుకుంటే త్వరగా రా, ఆలస్యంగా రావాలనుకుంటే ఆలస్యంగా రా కానీ, సమాధి మరణంగా రా" అనాలి.

సమాధి మరణమంటే, మనకి ఆత్మ తప్ప మరేదీ స్మృతిలో ఉండగూడదు. నిజస్వరూపం శుద్ధాత్మ తప్ప రెండవ ఆలోచనే ఉండగూడదు. మనసు, బుద్ధి, చిత్తం, అహంకారం వంటి ఝంఝాటాలేమీ వద్దు. నిరంతర సమాధి! దేహానికో ఉపాధి ఉన్నా, అది మనలను తాకగూడదు. దేహమంటే ఉపాధితో ఉంటుంది కదా!

**ప్రశ్నకర్త:** ఔను.

**దాదాశ్రీ:** కేవలం ఉపాధి కలిగివుండటమే కాదు, వ్యాధులతో కూడా కూడివుంటుంది– అంతే కదా! భౌతిక ఉపాధులు జ్ఞానికి అంటవు. వ్యాధులున్నా సరే, అవీ అంటవు. మరి అజ్ఞానైతే వ్యాధులు లేకపోయినా వాటిని ఆహ్వానిస్తాడు. సమాధి మృత్యు అంటే అర్థం "నేను శుద్ధాత్మను" అనే భావంలో ఉండటం. ఎందరో మహాత్ములకు మృత్యువు వచ్చింది. వాళ్ళందరూ "నేను శుద్ధాత్మను, నేను శుద్ధాత్మను" అనే భావంలోనే ఉండువున్నారు.

## గతికి సంకేతం

**ప్రశ్న కర్త:** ఈ జీవనగమనం సరిగ్గా ఉందా లేదా అనేది మృత్యు సమయంలో ఏదైనా సంకేతం వలన తెలియవస్తుందా?

**దాదాశ్రీ:** ఆ సమయంలో ఇంట్లో అంతా గోలగోలగా ఉంటుంది. "నా కూతురు పెళ్ళి అయిందా, అవలేదుకదా! అవలేదు!" అంటూ దుఃఖపడటం జరుగుతుంటే, వాళ్ళ గతి ఇక అధోగతేనని తెలుసుకోండి. ఒకవేళ ఆత్మలో ఉంటే, అంటే భగవత్స్మరణలో ఉంటే మంచి గతి ప్రాప్తిస్తుంది.

**ప్రశ్నకర్త:** ఒకవేళ కొన్నాళ్ళు అపస్మారంలో ఉంటే?

**దాదాశ్రీ:** అపస్మారంలో ఉన్నా, లోపల జ్ఞానంలో ఉంటే పరవాలేదు. ఈ జ్ఞానాన్ని పొందివుండాలి. అప్పుడు స్పృహలేకుండా ఉన్నా సరే.

## మృత్యు భయం

**ప్రశ్నకర్త:** మృత్యువంటే భయం ఎందుకుంటుంది అందరికీ?

**దాదాశ్రీ:** మృత్యుభయం అహంకారికే ఉంటుంది కాని ఆత్మకి ఏమీ ఉండదు. అహంకారికే, "నేను చచ్చిపోతాను, చచ్చిపోతాను" అనే భయం ఉంటుంది.

## ఆ దృష్టితో చూస్తే మంచిది

అసలు విషయమేమిటంటే, భగవంతుని దృష్టిలో ప్రపంచంలో ఏం జరుగుతూవుంది అని అంటే, "ఆయన దృష్టిలో ఎవరూ చనిపోవటమనేదే ఉండదు" అంటారు. అటువంటి

భగవానుని దృష్టికోణంలో చూడగలిగితే, అటువంటి దృష్టిని మీకు ఒక రోజు కోసమైనా ప్రసాదిస్తే, ఇక్కడ ఎంతమంచి చనిపోయినాసరే, దాని ప్రభావం మీమీద ఎంతమాత్రం ఉండదు. ఎందుకంటే, భగవంతుని దృష్టిలో అసలు ఎవరూ చనిపోనే చనిపోరు.

## జీవికి మరణం, శివం అమరం

ఎప్పుడో ఒకప్పుడు సొల్యూషన్ (పరిష్కారం) అనేది ఉండాలి కదా! జననమరణాలకు ఒక సొల్యూషన్ అంటూ ఉండాలికదా. వాస్తవానికి మరణమూలేదు, వాస్తవానికి జననమూ లేదు. అలా భావించటంవలన జరిగిన తప్పిదమే, ఎవరికి వారు జీవిస్తున్నానని అనుకోవటం. అసలు తాను శివమే కాని తనకా సంగతి తెలియదు, తనకు తాను జీవస్వరూపమని అనుకుంటూవుంటాడు.

**ప్రశ్నకర్త:** ప్రతి జీవీ అలా అర్థం చేసుకుంటే ఇక ఈ ప్రపంచం నడవదుకదా!

**దాదాశ్రీ:** ఔను ఇలా నడవదుకదా! కాకపోతే అందరికీ ఇది అర్థమవటమనేది జరగదు కూడా. ఇదంతా ఒక పజిల్. అత్యంత గుహ్యం, అత్యంత గుహ్యతమం. ఈ గుహ్యతమం కారణంగానే ప్రపంచమంతా ఇలా గందరగోళంగా నడుస్తూ ఉంటుంది.

## జీవించేది, మరణించేది ఎవరు?

జననమరణాలు ఆత్మకైతే లేవు. ఆత్మ అనేది పర్మనెంటు వస్తువు. ఈ జన్మమృత్యు ఇగోయిజం ఉండేది అహంకారానికే. ఇగోయిజమే జన్మ తీసుకుంటుంది, ఇగోయిజమే మరణిస్తుంది. వాస్తవానికి ఆత్మ మరణించనే మరణించదు. అహంకారమే జన్మతీసుకుంటుంది, అహంకారమే మరణిస్తుంది.

## మృత్యు సమయానికి ముందు, ఆ తర్వాత ఆత్మ స్థితి

## జననమరణాలు ఏమిటి?

**ప్రశ్నకర్త:** జననమరణాలు ఏమిటి?

**దాదాశ్రీ:** జననమరణాలు సంభవిస్తుంటాయి. అందులో ఏముందో మనం చూస్తాము. అందులో అడిగితెలుసుకునేదేమీ లేదు. జననం, మరణం అంటే ఆ వ్యక్తి లెక్క పూర్తయింది. ఒక జన్మకి పెట్టుకున్న లెక్క పూర్తయింది కనుకనే మరణం సంభవిస్తుంది.

# మరణం అంటే ఏమిటి?

**ప్రశ్నకర్త:** మరణం అంటే ఏమిటి?

**దాదాశ్రీ:** మృత్యువంటే, మనం ఒక షర్ట్ కుట్టించుకున్నామంటే ఆ షర్టు జననం జరిగింది. జన్మించింది కనుకనే మరణించటమూ ఉండవలసిందే. ఏ వస్తువైనా జన్మిస్తే అది మరణించటం కూడా తప్పక జరుగుతుంది. కానీ, ఆత్మకి పుట్టుకలేదు. అది అమరమైనది. దానికి మరణం కూడా ఉండదు. అంటే, ఎన్ని వస్తువులైతే ఉత్పన్నమౌతాయో, వాటన్నిటికీ మృత్యువు అనివార్యం. చనిపోతే జన్మించటమూ జరుగుతుంది. జననంతోపాటు మరణానికి జాయింట్ ఏర్పడింది. జన్మించటమంటూ జరిగితే మరణించటం కూడా అవశ్యం జరుగుతుంది.

**ప్రశ్నకర్త:** మృత్యువుర దేనికోసం?

**దాదాశ్రీ:** మృత్యువు ఎలాంటిదంటే, ఈ దేహం జన్మతీసుకోవటం సంయోగం కనుక, వియోగం లేకుండా ఉండదు. సంయోగం ఎప్పుడూ వియోగ స్వభావానికే ఉంటుంది. మనం స్కూల్‌లో చదువుకోవటానికి వెళ్ళినపుడు మనం ప్రారంభించాం అవునా? అది బిగినింగ్. మరి చివరకు ఎండ్ వచ్చిందా లేదా? ప్రతి ఒక్కటీ బిగినింగ్, ఎండ్ రెండూ కలిగివుంటుంది. ఇక్కడ ప్రతి ఒక్కదానికీ బిగినింగ్, ఎండ్ ఉంటాయి. ఏం అర్థం కాలే నీకు?

**ప్రశ్నకర్త:** అర్థమైంది కదా!

**దాదాశ్రీ:** ఇవన్నీ బిగినింగ్ ఎండ్ ఉన్నవి. అయితే, బిగినింగ్, ఎండ్‌లను తెలుసుకుంటే, ఆ తెలుసుకున్నవాడెవరు?

అన్ని వస్తువులూ బిగినింగ్, ఎండ్ కలిగినవే. అవి టెంపరరీ (తాత్కాలికమైన) వస్తువులు. బిగినింగ్ ఉన్నదానికి ఎండింగ్ కూడా ఉంటుంది. బిగినింగ్ ఉంటే ఎండింగ్ తప్పనిసరి. ఇవన్నీ టెంపరరీ వస్తువులు. కాని ఈ టెంపరరీ వాటిని అర్థం చేసుకున్నవాడెవరు? నువ్వే ఆ పర్మనెంటు వ్యక్తి. ఎందుకంటే, వీటన్నిటినీ టెంపరరీ అని అర్థం చేసుకున్నావు కనుక. అందుకే నీవు పర్మనెంటు. అన్ని వస్తువులూ టెంపరరీ అయినట్లయితే ఇక దేన్నీ ప్రత్యేకంగా టెంపరరీ అని అనవలసిన అవసరమే ఉండదు. టెంపరరీ అనేది సాపేక్ష పదం. పర్మనెంటు ఉంటేనే టెంపరరీ అనేది ఉంటుంది.

## మృత్యువుకి కారణం

**ప్రశ్నకర్త:** మృత్యువెందుకు వస్తుంది?

**దాదాశ్రీ:** ఎందుకంటే, జన్మతీసుకున్నప్పుడు మనకి మనో-వచన-కాయమనే మూడు బ్యాటరీలు ఉంటాయి. అవి గర్భంలో ఉన్నప్పుడే ఎఫెక్ట్ (పరిణామం) మొదలుపెడుతుంది. ఆ ఎఫెక్ట్ సమసిపోయినప్పుడు బ్యాటరీల లెక్క కూడా పూర్తయిపోతుంది. అప్పటివరకూ ఆ బ్యాటరీలు ఉంటాయి కాని, అవి అయిపోయినప్పుడు దాన్ని మృత్యువు అంటారు. మరుజన్మలో కొత్త బ్యాటరీలు ఛార్జింగ్ అవుతాయి. తర్వాత జన్మలో కొత్త బ్యాటరీలు లోపల ఛార్జ్ అవుతుంటాయి, పాత బ్యాటరీలు డిశ్చార్జ్ అవుతుంటాయి. అలా ఛార్జ్ డిశ్చార్జ్ అవుతూనేవుంటాయి. ఎందుకంటే దానికున్నది 'రాంగ్ బిలీఫ్'. అందువలన కాజెస్ ఉత్పన్నమవుతుంటాయి. 'రాంగ్ బిలీఫ్' ఉన్నంతకాలం, రాగద్వేషాలు, కాజెస్ ఉత్పన్నమవుతుంటాయి. 'రాంగ్ బిలీఫ్' మారి, 'రైట్ బిలీఫ్' వచ్చినప్పుడు, రాగద్వేషాలు, కాజెస్ ఉత్పన్నమవటం మానేస్తాయి.

## పునర్జన్మ

**ప్రశ్నకర్త:** జీవాత్మ మరణించిన తర్వాత తిరిగి వస్తాడు కదా!

**దాదాశ్రీ:** ఇది ఎలా అంటే, విదేశీయులకు అలా తిరిగి రారు. ముస్లింలు కూడా తిరిగి రారు. కాని, మీవాళ్ళు తిరిగివస్తారు కదా! మీమీద భగవంతుని కృప ఎంత ఉంటుందంటే, మీవాళ్ళు తిరిగివస్తారు. ఇక్కడి నుండి మరణించటంతోనే అక్కడ మరో యోనిలోకి వెళ్ళిపోతాడు. కానీ, ఆయనవాళ్ళు తిరిగి రారు.

వాస్తవానికి వాళ్ళు తిరిగిరారు అని కాదు. వాళ్ళు అనుకునేదేమిటంటే, ఇక్కడి నుండి పోయారు, అంటే చనిపోయారు. కానీ, వాళ్ళు తిరిగివస్తారు. అయితే వాళ్ళకది అర్థం కాదు. పునర్జన్మనే అర్థం చేసుకోరు. మీకు పునర్జన్మ అంటే ఏమిటన్నది అర్థమౌతుందా?

శరీరం మృతిచెందినపుడు అది జడపదార్థమౌతుంది. దానితో అది అంతకు ముందు జీవించివుందని, అది అందులోంచి మరో చోటికి వెళ్ళిందని నిర్ధారణ అవుతుంది. విదేశీయులు ఏమంటారంటే, ఇదే జీవి, అదే మరణించింది అని. దాన్ని మనం సమ్మతించం. మనం

పునర్జన్మని నమ్ముతాం. మనం డెవలప్ అయ్యాం (అభివృద్ధి చెందాం). మనకు వీతరాగ విజ్ఞానాన్ని అర్థం చేసుకుంటాం. వీతరాగ విజ్ఞానం ఏమంటుందంటే, "పునర్జన్మ వలనే మనం ఒక దగ్గర చేరాం" అని. దీన్ని భారతదేశంలోనే అర్థం చేసుకుంటాం. దాని ఆధారంగానే మనం ఆత్మ అనేది ఉంటుందని నమ్మాం. అలా కాకుండా పునర్జన్మ అనేది నమ్మకపోతే ఇక ఆత్మని ఎలా నమ్మగలం?

అయితే, ఎవరికి ఆ పునర్జన్మ కలిగేది? దానికి ఏం చెప్తారంటే, "ఆత్మ ఉంటేనే పునర్జన్మ ఉంటుంది. ఎందుకంటే దేహం మరణిస్తుంది, దాన్ని కాల్చేస్తారు" అన్నది మన నమ్మకం.

కనుక, ఆత్మని అర్థం చేసుకుంటే విషయం తేటతెల్లమౌతుంది కదా! కానీ అర్థం చేసుకోరు కదా. అందుకే శాస్త్రాలన్నిటిలోను, "ఆత్మను తెలుసుకో" అని చెప్పారు. దాన్ని తెలుసుకోకుండా ఏం చేసినా దానివలన అతనికి ఎటువంటి ప్రయోజనమూ ఉండదు. హెల్ప్ అవదు. ఆత్మను తెలుసుకుంటే పూర్తి సొల్యూషన్ (పరిష్కారం) దొరుకుతుంది.

## పునర్జన్మ ఎవరికి?

**ప్రశ్నకర్త:** పునర్జన్మ తీసుకునేది ఎవరు? జీవి తీసుకుంటుందా లేక ఆత్మా?

**దాదాశ్రీ:** లేదు ఎవరికీ తీసుకోవలసిన అవసరం లేదు. అది జరిగిపోతుంది. ప్రపంచంలో 'ఇట్ హ్యాపెన్స్' తనంతటతానుగా జరిగిపోతుంది అంతే!

**ప్రశ్నకర్త:** సరే కాని అది ఎవరివలన జరుగుతుంది? జీవితోనా లేక ఆత్మతోనా?

**దాదాశ్రీ:** లేదు లేదు. ఆత్మకు ఇందులో ఎటువంటి ప్రమేయమూ లేదు. అంతా జీవితోనే జరుగుతుంది. భౌతిక సుఖాలను కోరుకున్నవారికే యోనిలో ప్రవేశించే 'రైట్' (అధికారం) ఉంటుంది. భౌతిక సుఖాలను కోరుకోనివారికి యోనిలో ప్రవేశించే రైటు పోతుంది.

## జన్మజన్మల సంబంధం

**ప్రశ్నకర్త:** మనిషి ప్రతిజన్మకీ పూర్వజన్మతో సంబంధం ఉంటుందా?

**దాదాశ్రీ:** నిజానికి ప్రతి జన్మా పూర్వజన్మే అవుతుంది. అంటే, ప్రతి జన్మకి సంబంధం పూర్వజన్మతోనే ఉంటుంది.

**ప్రశ్నకర్త:** కాని, పూర్వజన్మకి ఈ జన్మతో ఏం సంబంధం?

**దాదాశ్రీ:** అరె, తర్వాత జన్మకి అది పూర్వజన్మే కదా. జరిగిపోయిన జన్మ పూర్వజన్మ అయితే, ఈ జన్మ వచ్చే జన్మకి పూర్వజన్మ అనిపించుకుంటుంది కదా!

**ప్రశ్నకర్త:** ఔను. అదీ నిజమే. కానీ పూర్వజన్మలో జరిగినదానితో ప్రస్తుత జన్మకి ఏమైనా సంబంధం ఉంటుందా?

**దాదాశ్రీ:** ఎంతో సంబంధం ఉంటుంది నీరా! పూర్వజన్మలో విత్తనం పడుతుంది, తర్వాత జన్మలో అది ఫలిస్తుంది. అంటే అందులో, విత్తనంలో, ఫలంలో తేడా ఏమీ లేదా? వాటి మధ్య సంబంధం ఉందా లేదా? మనం బజారు నుంచి తెచ్చిన విత్తనాలను నాటితే, అది పూర్వజన్మ. అది మొలకెత్తుతే అది ఈ జన్మ. ఆ మొలకలోంచి విత్తనం రూపంలో గింజలు రాలితే అది పూర్వజన్మ. అందులోంచి మళ్ళీ మొలకెత్తుతే అది కొత్త జన్మ. అర్థమైందా లేదా?

**ప్రశ్నకర్త:** ఒక వ్యక్తి దారిలో నడుస్తూపోతుంటే, మిగతావాళ్ళు ఎంతమంది ఆ దారిలో నడుస్తూపోతున్నా, పాము అందులో ఒక్కడినే కాటువేస్తే, అందుకు కారణం అతని పూర్వజన్మేనా?

**దాదాశ్రీ:** ఔను. నేను అదే చెప్పబోతున్నా. పూర్వజన్మే. అందుకే ఆ పాము మిమ్మల్ని కాటువేసింది. పూర్వజన్మ లేకపోతే ఆ పాము మిమ్మల్ని కాటువేయదు. పూర్వజన్మ ఉంది, అది మీ బాకీ మీకు తీర్చేస్తుంది. ఇక్కడ అందరూ వారి వారి బాకీలను తీర్చేసుకుంటున్నారు. ఖాతాపుస్తకంలోని బాకీలు తీర్చేస్తున్నట్లుగానే, వీళ్ళంతా వీళ్ళవీళ్ళ బాకీలను తీర్చేసుకుంటున్నారు. డెవలప్‌మెంటు కారణంగా ఆ లెక్కలు బాకీలు అన్నీ మనకు అర్థమౌతాయి. అందువలనే మనదగ్గర ఎంతోమందికి పునర్జన్మ ఉందనే నమ్మకం ఏర్పడింది కదా. కాని, అది 'పునర్జన్మ' అని చెప్పలేరు. అది ఉందనే ఋజువు చూపించలేరు. కాని, అది వాళ్ళ విశ్వాసం అయింది. ఎన్నో ఉదాహరణలతో పునర్జన్మ ఉందని అనవచ్చు.

ఈ సోదరి, తనకి మంచి అత్తగారు ఎందుకు దొరకలేదు, ఎందుకు ఇలాంటామె దొరికింది, అని అంటుంది. అంటే, సంయోగమనేది ఎవరికి వారికి భిన్న రూపాలలో జరుగుతుంది.

## ఏమేం వెంట తీసుకెళ్తారు?

**ప్రశ్నకర్త:** ప్రతి జీవి, మరో దేహంలోకి ప్రవేశించినపుడు, అక్కడికి తనతోపాటు పంచేంద్రియాలు, మనస్సు మొదలైనవి తీసుకెళ్తాడా?

**దాదాశ్రీ:** లేదు లేదు. అలాంటిదేమీ లేదు. ఇంద్రియాలన్నీ ఎగ్జాస్ట్ (ఖాళీ) అయిపోయి నశించాయి. ఇంద్రియాలైతే చచ్చిపోయాయి. అందువలన అతనితోపాటు ఇంద్రియాలు, అలాంటివేమీ వెంట పోవు. ఈ క్రోధం, మానం, మాయ, లోభాలు మాత్రమే పోతాయి. అందుకే శరీరంలోకి క్రోధం, మానం, మాయ, లోభాలు వచ్చేస్తాయి. సూక్ష్మ శరీరం ఎలా ఉంటుంది? మోక్షం ప్రాప్తించనంత వరకూ, అవి వెంటే వస్తుంటాయి. జన్మ ఎక్కడ తీసుకున్నా సరే, సూక్ష్మశరీరమైతే మీ వెంటే ఉంటుంది.

## ఎలక్ట్రికల్ బాడీ

దేహాన్ని వదిలిన ఆత్మ ఒంటరిగా పోదు. ఆత్మతో పాటు కారణశరీరమనబడే కర్మలన్నీ, ఎలక్ట్రికల్ బాడీ (తేజోశరీరం), ఈ మూడూ కలిసే పయనిస్తాయి. ఈ ప్రపంచం ఉన్నంతకాలం, ప్రతిజీవిలోనూ ఈ ఎలక్ట్రికల్ బాడీ ఉంటుంది. కారణశరీరం ముడిపడివుంటుంది, ఎలక్ట్రికల్ బాడీ వెంట వుంటుంది. ప్రతి జీవిలోను ఎలక్ట్రికల్ బాడీ సామాన్యంగా ఉంటుంది, దాని ఆధారంగానే ఆ జీవి తన జీవితాన్ని నడిపిస్తుంది. మనం భోజనం చేస్తే దాన్ని అరిగించే పని ఎలక్ట్రికల్ బాడీ చేస్తుంది. రక్తం తయారౌతుంది, రక్త ప్రసరణ పైకి, కిందికి జరుగుతుంటుంది. ఈ పనులన్నిటినీ ఎలక్ట్రికల్ బాడీ నిర్వహిస్తుంది. కళ్ళకి కనిపిస్తుందంటే ఆ వెలుగు ఈ ఎలక్ట్రిక్ బాడీ వలనే జరుగుతుంది. అంతేకాదు, క్రోధం, మోహం, లోభం, మాయలు కూడా ఎలక్ట్రిక్ బాడీ కలుగుతాయి. క్రోధం, మోహం, లోభం, మాయా గుణాలు ఆత్మలో ఉండవు. కోపం రావటం కూడా ఎలక్ట్రికల్ బాడీ ఇచ్చే షాకే (విద్యుత్ఘాతం).

**ప్రశ్నకర్త:** అంటే, ఛార్జింగ్ అవటానికి 'ఎలక్ట్రికల్ బాడీ' ఉపయోగపడుతుందా?

**దాదాశ్రీ:** ఎలక్ట్రికల్ బాడీ ఉంటేనే ఛార్జింగ్ జరుగుతుంది. ఎలక్ట్రికల్ బాడీయే లేకపోతే ఏ పనీ జరగదు. ఎలక్ట్రికల్ బాడీ ఉండి ఆత్మ లేకపోతే కూడా ఏ పనీ జరగదు. ఇవన్నీ సముచ్ఛ 'కాజెస్'.

## జీవుడు గర్భంలో ప్రవేశించేదెప్పుడు?

**ప్రశ్నకర్త:** సంచరిస్తుంది కనుకనే జీవి ప్రవేశిస్తుంది. ప్రాణం వస్తుంది అని వేదాలలో చెప్తారు.

**దాదాశ్రీ:** లేదు అవన్నీ ఒట్టి మాటలే. అది అనుభవైక జ్ఞానం కాదు. అందులో సత్యం లేదు. లౌకిక భాషలో అలా అంటారు. జీవి లేకుండా గర్భదారణ ఎప్పుడూ కాదు. జీవి సమక్షంలోనే గర్భధారణ జరుగుతుంది, లేకపోతే లేదు. అతను ముందు గుడ్డు లాగా నిద్రాణమైన స్థితిలో ఉంటాడు.

**ప్రశ్నకర్త:** కోడి గుడ్డుకి కూడా రంధ్రం చేసుకుని లోపలికి ప్రవేశించాడా జీవుడు?

**దాదాశ్రీ:** అలా కాదు. కేవలం లౌకికంలోనే అలా అనటం జరుగుతుంది. లౌకికంలో ఉన్న మీరంతా, అలా అన్నారు, అలా రాసారు. ఎందుకంటే, గర్భధారణ అనేది కాల ప్రభావం. అంతా సైంటిఫిక్ సర్కమ్‌స్టాన్షియల్ ఎవిడెన్స్... కాలం అలా కలిసివచ్చినపుడు ధారణ జరుగుతుంది.

తొమ్మిదినెలలపాటు జీవి గర్భంలో ఎప్పుడైతే ఉన్న తర్వాత బాహ్యంలోకి ప్రకటితమౌతాడు. ఒకవేళ ఏడు నెలలకే జీవుడు బయటకు వస్తే, తక్కువ నెలలు అవటం వలన పరిపక్వత ఉండదు. ఆ జీవి మెదడు గిదడు అంతా పచ్చిగా ఉంటుంది. ఏడు నెలల తర్వాత పుట్టటం వలన అవయవాలు కూడా అపరిపక్వంగా ఉంటాయి. ఒకవేళ పద్ధెనిమిది నెలలకు బయటకు వస్తే ఆ ఫలితమే వేరుగా ఉంటుంది. మెదడు చాల హై లెవెల్ (ఉచ్ఛ స్థితి) లో ఉంటుంది. అంటే, తొమ్మిది నెలలకంటే ఎన్ని ఎక్కువ నెలలు గర్భంలో ఉంటే, అతని మెదడు "అంత టాప్" గా ఉంటుంది అని తెలుసా మీకు?

ఏం అలా చెప్పలేదా? పద్ధెనిమిది నెలల గురించి మీరు వినలేదా? అలా ఎప్పుడూ వినలేదా? ఇంతకు ముందు ఎప్పుడూ వినలేదనుకుంటా ఔనా? "వదిలెయ్యండి. "ఈ మాట అతని అమ్మ చెప్తుంది అతను పద్ధెనిమిది నెలలవాడు" అని. అతను చాల తెలివైనవాడవుతాడు. తల్లి గర్భంలోంచి బయటకే రాడు! పద్ధెనిమిది నెలలు అక్కడే దర్జాగా గడిపేస్తాడు.

## మధ్యలో వ్యవధి ఎంత?

**ప్రశ్నకర్త:** అయితే ఈ శరీరాన్ని వదిలిపెట్టటం, మరో శరీర ధారణ చేయటానికి మధ్య ఎంత కాల వ్యవధి ఉండవచ్చు?

**దాదాశ్రీ:** సమయమేమీ పట్టదు. ఇక్కడా ఉంటాడు, ఇక్కడ శరీరంలోంచి బయటకు వస్తుంటాడు, అక్కడ యోనిలో కూడా హాజరవుతాడు. ఎందుకంటే, అదే టైమింగ్. వీర్యము, రజస్సుల సంయోగమౌతుందే, ఆ సమయం. ఇక్కడ శరీరాన్ని వదిలిపెట్టబోతున్నట్లయితే, అక్కడ సంయోగం జరుగుతుంది. అవన్నీ కూడినప్పుడే ఇక్కడి నుండి చని (వెళ్ళి) పోతాడు. అలా లేకపోతే ఇక్కడి నుండి పోనేపోడు. అంటే, మనిషికి మృత్యువు సంభవించిన తర్వాత ఆత్మ నేరుగా రెండవ యోని లోనికి పోతాడు. అందువలన, ఆ తర్వాత ఏమౌతుంది అని చింతించాల్సిన అవసరమే లేదు. ఎందుకంటే మరణించిన తర్వాత మరో యోని లభిస్తుంది. ఆ యోనిలో ప్రవేశిస్తూనే అక్కడ ఆహారం సిద్ధంగా ఉంటుంది.

## దానితో కారణ శరీరానికి సర్జన్

జగమంతా భ్రాంతిమయం. అది క్రియలనే చూస్తుంది కాని ధ్యానాన్ని చూడదు. ధ్యానం తర్వాత జన్మ పురుషార్థం, క్రియ పూర్వ జన్మ పురుషార్థం. ధ్యానం, తర్వాత జన్మకి ఫలితాన్నిచ్చేది. ధ్యానం, పరమాణువుని బయటకు లాగుతుంది, అది ధ్యానరూపంలో లోపల సూక్ష్మ సంగ్రహితమై ఉంటూ, కారణ శరీరానికి సర్జన్ అవుతుంది. ఋణానుబంధంలో మాతృ గర్భంలోకి ప్రవేశించినపుడు, కార్య శరీర రచన జరుగుతుంది. మనిషి మరణించినపుడు, ఆత్మ, సూక్ష్మశరీరం, కారణ శరీరం వెంటపోతాయి. సూక్ష్మ శరీరం అందరికీ కామన్‌గానే ఉంటుంది. కాని, కారణ శరీరాలు మాత్రం వాటి కాజెస్ ప్రకారం వేరువేరుగా ఉంటాయి. సూక్ష్మ శరీరం ఒక ఎలక్ట్రిక్ బాడీ (తేజో శరీరం).

## కార్యకారణ బంధం

మృత్యువు తర్వాత జన్మ, జన్మ తర్వాత మృత్యువు. అంతే! ఇది నిరంతరం నడుస్తూనేవుంటుంది. అయితే, ఈ జన్మ మృత్యువులు ఎందుకు ఎందుకు జరుగుతున్నాయి? దీన్నే కాజెస్ అండ్ ఎఫెక్ట్, ఎఫెక్ట్ అండ్ కాజెస్ అంటారు. కారణ కార్యాలు, కార్యము కారణాలు. వీటిల్లో కారణాన్ని అంతం చేస్తే, అన్ని ఎఫెక్ట్‌లు ఆగిపోతాయి. ఇక మరో జన్మ తీసుకోవలసిన అవసరమే పడదు.

ఇక్కడ జీవితాంతం "కాజెస్" ని తయారుచేసుకునివుంటే, ఆ మీ "కాజెస్" వేరే ఎవరి దగ్గరకి పోతాయి? అంతేకాదు, మీరు తయారుచేసుకున్న "కాజెస్" వాటి కార్యఫలాన్ని ఇవ్వకుండా అయితే ఉండవు. "కాజెస్" ని మీరు తయారుచేసి పెట్టుకున్నారు అన్న విషయం మీకు తెలుస్తోందా?

ప్రతి కార్యంలోను "కాజెస్" ఉత్పన్నమౌతాయి. ఎవరైనా మిమ్మల్ని, "చేతగానివాడా" అని అన్నారనుకోండి, అతను ఆ మాటను న్యాయబద్ధంగా అన్నాడు, మీరేమే అతన్ని అన్యాయంగా అన్నాడని అనుకుంటారు. ఈ సంగతి మీకు అర్థం కాలేదా? అలా అంటారా అనరా?

**ప్రశ్నకర్త:** ఔను నిజమే.

**దాదాశ్రీ:** అంటే, "కాజెస్" ఈ జన్మలో తయారౌతాయి. దాని ఫలితాన్ని మరుజన్మలో అనుభవించవలసివుంటుంది.

ఇది, ఎఫెక్టివ్ మోహాన్ని "కాజెస్" మోహంగా తీసుకోవటమే అవుతుంది. "నేను కోపం తెచ్చుకుంటున్నాను" అని మీరు అనుకుంటున్నారు. కాని మీలో ఈ భ్రాంతి ఉన్నంత కాలమే మీలో ఆ కోపమనేది ఉంటుంది. తర్వాత కోపమనేదే లేదు. అది కేవలం ఎఫెక్ట్ అంతే. "కాజెస్" ఆగిపోయినప్పుడు, కేవలం ఎఫెక్ట్ ఒక్కటే మిగిలివుంటుంది. అతను "కాజెస్" ని నిలిపివేసాడు కనుక "హి ఈజ్ నాట్ రెస్పాన్సిబుల్ ఫర్ ఎఫెక్ట్" (జరిగే పరిణామంలో అతని ప్రమేయమేమీ లేదు), ఎఫెక్ట్ తన ప్రభావాన్ని చూపించకుండా ఉండేది కూడా కాదు.

## కాజెస్ ఆగిపోతాయా?

**ప్రశ్నకర్త:** శరీరం, ఆత్మల మధ్య సంబంధమైతే ఉంది కదా!

**దాదాశ్రీ:** ఇది దేహం, అది ఆత్మ అజ్ఞాన దశలో ఉన్న పరిణామం. ఏయే "కాజెస్"ని తయారుచేసుకోవటం జరిగిందో, వాటి పరిణామమే ఇది. మీకు ఎవరైనా పూలదండ వేస్తే మీరు ఎంతో ఆనందపడతారు. అదే మిమ్మల్ని తిడితే మీకు కోపం వస్తుంది. అలా కోపం తెచ్చుకోవటం, ఆనందపడటం బయట ప్రదర్శించినంత మాత్రాన ఏమీ జరగదు. లోపల కలిగే భావాల వలనే కర్మ చార్జ్ అవుతుంది. దాన్ని తర్వాత జన్మలో డిశ్చార్జ్ అవుతుంది. ఆ సమయంలో అది ఎఫెక్టివ్. మనసు, వాక్కు, శరీరం ఈ మూడు ఎఫెక్టివ్. ఎఫెక్ట్‌ని అనుభవస్తున్నప్పుడు "కాజెస్" తయారౌతాయి. అవి తర్వాత జన్మలో ఎఫెక్టివ్ అవుతాయి. ఈ విధంగా "కాజెస్ అండ్ ఎఫెక్ట్", "ఎఫెక్ట్ అండ్ కాజెస్" ఈ క్రమంలో నిరంతరం సాగుతూనే వుంటాయి.

కేవలం మానవ జన్మలోనే "కాజెస్" ఆగిపోయే అవకాశం ఉంది. మిగతా అన్ని గతులలో కేవలం "ఎఫెక్ట్" మాత్రమే ఉంటుంది. ఇక్కడ "కాజెస్ అండ్ ఎఫెక్ట్" రెండూ ఉన్నాయి. మేము జ్ఞానోపదేశం చేసే సమయంలో "కాజెస్" ని నిలిపివేస్తాము. ఇక మళ్ళీ కొత్త "ఎఫెక్ట్" ఏమీ ఉండదు.

## అప్పటి వరకు తిరుగాడుతూనే వుండాలి.

"ఎఫెక్టివ్ బాడీ" అంటే, మనసు, వాక్కు, శరీరాల మూడు బ్యాటరీలు తయారౌతాయి. వాటి వలన మళ్ళీ కొత్త "కాజెస్" తయారౌతాయి. అంటే ఈ జన్మలో మనసు, వాక్కు, శరీరాలు డిశ్చార్జ్ అవుతుంటాయి, లోపల కొత్తవి చార్జ్ అవుతుంటాయి. ఛార్జ్ అవుతున్న మనసు, వాక్కు, శరీరాల బ్యాటరీలు, వచ్చే జన్మ కోసమే. పూర్వజన్మలోవి ఇప్పుడు డిశ్చార్జ్ అవుతుంటాయి. జ్ఞానిపురుషులు కొత్తగా చార్జ్ అవకుండా నిలిపివేస్తారు. అందువలన పాతవే డిశ్చార్జ్ అవుతుంటాయి.

అందువలన మృత్యువు తర్వాత ఆత్మ మరో యోనిలోకి ప్రవేశిస్తుంది. ఎవరికివారు "సెల్ఫ్ రియలైజ్" (ఆత్మజ్ఞానం) పొందనంతవరకు అన్ని యోనులలోకి తిరుగుతుండవలసి వుంటుంది. మనస్సులో తన్మయాకారం, బుద్ధిలోను తన్మయాకారం జరిగినంతకాలమే ఈ ప్రపంచం నడుస్తుంది. ఎందుకంటే, తన్మయాకారం పొందటమంటే యోనిలో విత్తనం పడటం.

కృష్ణ భగవానుడు ఈ విషయంలో, యోనిలో బీజం పడుతుంది, దానివలనే ప్రపంచం నడుస్తుంది. యోనిలో బీజం పడటం ఆగిపోతే, అతని ప్రపంచం సమాప్తమైనట్లే అన్నాడు.

## విజ్ఞానం వక్రగతిది

**ప్రశ్న కర్త:** "థియరీ ఆఫ్ ఇవొల్యూషన్" (ఉత్క్రాంతివాదం) ప్రకారం, జీవి ఒక ఇంద్రియం నుంచి రెండవ ఇంద్రియం అలా "డెవలప్" అవుతూ మనిషిగా పరిణమించటం, తిరిగి మనిషి నుంచి జంతువుగా మారటం జరుగుతుంది. అందువలన ఈ "ఇవొల్యూషన్ థీరీ" లో, కాస్త భిన్నంగా కనపడుతోంది. దాన్ని కొద్దిగా స్పష్టీకరిస్తారా?

**దాదాశ్రీ:** ఏంలేదు. దానిలో భిన్నంగా కనిపించేదేమీ లేదు. "ఇవొల్యూషన్ థీరీ" అంతా సరిగ్గానే ఉంది. మనుషుల వరకే ఈ "ఇవొల్యూషన్ థీరీ" కరెక్ట్. ఆ తర్వాత విషయాలు వాళ్ళకి తెలియదు.

**ప్రశ్నకర్త:** నా ప్రశ్న ఏమిటంటే, మనిషి తిరిగి పశుజన్మనెత్తుతాడా అని?

**దాదాశ్రీ:** సంగతేమిటంటే, మొదట్లో డార్విన్ థియరీ "ఉత్క్రాంతివాదం" ప్రకారం అభివృద్ధి చెందుతూ చెందుతూ మనిషిగా మారుతాడు. మనిషి జన్మనెత్తాడు కనుక "ఇగోయిజం" (అహంకారం) వస్తుంది, దానితో కర్తృత్వ భావమూ కలుగుతుంది. జరిగే కర్మకు తాను కర్తననుకుంటాడు. అందువలనే ఆ కర్మానుసారం ఫలితాన్ని అనుభవించవలసివుంటుంది. "డెబిట్" (పాపం) చేస్తే, జంతుజన్మని తీసుకోవలసివుంటుంది, "క్రెడిట్" (పుణ్యకార్యం) వలన దేవగతిని కాని, లేక మనిషి జన్మలోనే మహరాజ యోగంతో జీవించటం జరుగుతుంది. అంటే, మనిషి జన్మలోకి వచ్చిన తర్వాత జరిగేదంతా "డెబిట్", 'క్రెడిట్" ల మీద ఆధారపడివుంటుంది.

## ఆ తర్వాత లేవు ఎనభై నాలుగు లక్షల యోనులు

**ప్రశ్న కర్త:** కానీ, ఎనభైనాలుగు లక్షల యోనులలో సంచరించిన తర్వాత మానవ జన్మ లభిస్తుందని అంటారు. అంటే, అంత తిరిగిన తర్వాతనే మానవ జన్మ లభిస్తుంది కదా!

**దాదాశ్రీ:** అలాగేమీ జరగదు. ఒకసారి మానవజన్మనెత్తిన తర్వాత తిరిగి ఎనభైనాలుగువాటిలో తిరగవలసిన పనిలేదు. అతనికి పశుప్రవర్తన వస్తే, ఎక్కువలో ఎక్కువ ఎనిమిది జన్మల వరకు పశుయోనిలోకి వెళ్ళవలసివుంటుంది. అదైనా వంద, రెండువందల సంవత్సరాల వరకు. ఆ తర్వాత మళ్ళీ అదే మానవ జన్మలోకి వచ్చేస్తాడు. ఒకసారి మనిషి జన్మనెత్తిన తర్వాత, తిరిగి ఎనభైనాలుగు లక్షలసార్లు చక్కర్లు కొట్టవలసిన అవసరం పడదు.

**ప్రశ్నకర్త:** ఒకే ఆత్మ ఎనభైనాలుగు లక్షల చక్కర్లు కొడుతుందా?

**దాదాశ్రీ:** ఔను. ఒకే ఆత్మ.

**ప్రశ్నకర్త:** మరి ఆత్మ పవిత్రమైనది కదా!

**దాదాశ్రీ:** ఈ సమయంలో కూడా ఆత్మ పవిత్రమైనదే. ఎనభైనాలుగు లక్షల యోనులలో సంచరించినపుడు కూడా పవిత్రంగానే ఉంటుంది. పవిత్రంగా ఉండేది, పవిత్రంగానే ఉంటుంది.

## బలమైన కోరికనుబట్టే గతి

**ప్రశ్నకర్త:** మరణానికి ముందు ఉండే వాసనా (బలమైన ఇచ్ఛ) ను బట్టే ఆ జన్మలో రూపం వస్తుంది కదా!

**దాదాశ్రీ:** ఔను. మరణించటానికి ముందు అటువంటి బలమైన ఇచ్ఛ ఉండేది అని మనవాళ్ళు చెప్తున్నట్లుగానే ఉంటుంది కాని, దాన్ని ఎక్కడి నుండో తెచ్చుకోనక్కర్లేదు. అది మన జీవిత ఖాతాలోని లెక్కే. జీవితమంతా మీరేమేం చేసారో వాటి లెక్కంతా మరణానికి ఒక గంట ముందు ఆ మనిషి ముందుకి వస్తుంది. ఆ లెక్క ప్రకారమే గతి నిర్ధారణ జరుగుతుంది.

## మనిషి నుంచి తిరిగి మనిషి జన్మేనే?

**ప్రశ్నకర్త:** మనిషి నుంచి మనిషి జన్మలోకే వెళ్తారా?

**దాదాశ్రీ:** దీన్ని మీరు సరిగ్గా అర్థం చేసుకోలేదు. స్త్రీ గర్భంలోంచి జన్మించేది మనిషే. గాడిద పుట్టదు. కానీ మనం చనిపోయిన తర్వాత తిరిగి మనుషులలోనే పుడతామని అనుకుంటే

అది తప్పు. అరె, నీ ఆలోచనలేమో గాడిదకుండేవైతే మనిషిగా ఎలా పుడతావు? "ఎవరిది తీసుకుని అనుభవించాలి, ఎవరిది తేరగా తీసేసుకోవాలి" అనే ఆలోచనలు నీకు వస్తున్నాయి. నీకు హక్కులేనిదాన్ని అనుభవించాలనే ఆలోచన నీకు కలుగుతుంటే, ఆ ఆలోచనలే నిన్ను దానికి తగ్గ గతిలో నడిపిస్తాయి.

**ప్రశ్న కర్త:** మనిషిగా పుట్టినవాడు మరేవిధమైన జన్మనూ తీసుకోకుండా, తిరిగి మనిషిగానే జన్మతీసుకునేందుకు ఏమైనా మార్గముందా?

**దాదాశ్రీ:** భారతదేశంలో మనిషిజన్మ ఎత్తిన తర్వాత నాలుగు రకాల దిశలలో పరుగులెత్తవలసి వుంటుంది. ఫారిన్ మనుషుల విషయంలో అలా జరగదు. వాళ్ళలో రెండు నుంచి ఐదు శాతం వరకు అపమార్గంలో వెళ్ళేవాళ్ళుంటారు. మిగతావాళ్ళంతా ఊర్ధ్వగతిలో పయనిస్తారు.

**ప్రశ్నకర్త:** మనుషులు ఎవరినైతే విధాత అని అంటారో, అలా ఎందుకు అంటారు?

**దాదాశ్రీ:** ప్రకృతినే వాళ్ళు విధాత అని అంటారు. విధాత అనే పేరుతో దేవి ఎవరూ లేరు. "సైంటిఫిక్ సర్కమ్‌స్టాన్షియల్ ఎవిడెన్స్" (వైజ్ఞానిక సంయోగ ప్రమాణం) అనేదే విధాత. మనవాళ్ళ నమ్మకం ప్రకారం ఆరవ రోజున విధాత లిఖించటం జరుగుతుంది. వికల్పం ప్రకారం అదంతా సరే కాని, వాస్తవం తెలుసుకోవాలంటే అది నిజం కాదు.

ఇక్కడ నియమం ఏమిటంటే, తన హక్కు కానిది ఎవరైతే తీసుకుంటారో వాళ్ళ రెండు కాళ్ళు నాలుగు కాళ్ళవుతాయి. అయితే అది శాశ్వతంగా కాదు. ఎక్కువలో ఎక్కువ రెండు వందల సంవత్సరాల వరకు, ఏడు ఎనిమిది జన్మలు జంతువుగా. తక్కువలో తక్కువ ఐదే నిమిషాలు జంతువుగా పుట్టి, తిరిగి మనిషి జన్మలోకి వచ్చేస్తాడు. ఒక నిమిషంలో పదిహేడు జన్మలు తీసుకునే ప్రాణులు ఎన్ని లేవు? అలాంటి జీవులు కూడా ఉన్నాయి. అంటే, జంతు జన్మలోకి వెళ్ళినవాళ్ళందరికీ వంద రెండు వందల సంవత్సరాలు బ్రతికే పని లేదు.

## లక్షణాన్నిబట్టి అది అర్థమౌతుంది

**ప్రశ్న కర్త:** జంతు యోనిలోకి వెళ్ళినవాళ్ళ విషయంలో ఏమైనా నిరూపణలు ఉన్నాయా? ఈ విషయాన్ని వైజ్ఞానికపరంగా ఎలా నమ్మాలి?

**దాదాశ్రీ:** మొరిగే మనిషి మీకు ఎక్కడైనా కనిపించాడా? "ఎందుకలా మొరుగుతున్నావు?" అని మీరు అతన్ని అన్నారా? అతను అక్కడి నుంచే, కుక్కలలోంచే వచ్చాడు. ఎవరైనా కోతిలా ప్రవర్తిస్తుంటే వాళ్ళు అలాగే అవుతారు. పిల్లిలాగా కూర్చుని కళ్ళెళ్ళబెట్టి చూస్తుంటారు– మీది ఏమైనా తీసేసుకోవటానికి, లాక్కోవటానికి! అలాంటివాళ్ళు ఆ జాతి నుండి వచ్చినవారే. అంటే ఎవరు ఎక్కడి నుండి వచ్చారు, ఎక్కడికి వెళ్తారు అన్నది గుర్తించవచ్చు. అయితే అది శాశ్వతంగా ఉండదు. ఇలాంటి మనుషులకు పాపం చెయ్యటం కూడా సరిగ్గా రాదు.

కలియుగంలో మనుషులకు పాపం చేయటం కూడా రాదు కానీ, చేసేదంతా పాపమే. అందువలన, వాళ్ళ పాప ఫలితం ఎలా ఉంటుంది? మహా అయితే యాభై, వంద సంవత్సరాలు జంతు జన్మలలో జీవించి, తిరిగి వెనక్కి వచ్చేస్తారు. అందువలన, జంతుజాతిలోకి పోవటం ఏదో తప్పు అని అనుకోగూడదు. ఎందుకంటే వాళ్ళు పాపం వెంటనే తిరిగివచ్చేస్తారు. ఎందుకంటే అంత పెద్ద పాపం కూడా చెయ్యరు కదా. వీళ్ళకి పాపం చేసేంత శక్తి కూడా లేదు.

## హాని వృద్ధి నియమం

**ప్రశ్నకర్త:** మనుషుల సంఖ్య పెరుగుతూపోతోందంటే జంతువులు తక్కువైపోతున్నాయని అనుకోవాలా?

**దాదాశ్రీ:** ఔను నిజమే. ఆత్మలు ఉన్నన్నే ఉంటాయి కానీ కన్వర్షన్ (రూపాంతరం) అవుతుంటాయి. మనుషులు పెరుగుతుంటే జంతువులు తగ్గిపోతాయి, జంతువుల పెరుగుతుంటే మనుషులు తగ్గిపోతుంటారు. ఈ విధంగా కన్వర్షన్ అవుతుంటుంది. మళ్ళీ మనుషులు తగ్గిపోతారు. అలా మనుషుల తగ్గిపోవటం 1993 నుంచి మొదలౌతుంది.

అప్పుడు, 2000 వ సంవత్సరం నుంచి ఇలా అవొచ్చు, అలా అవొచ్చు అనే కాలిక్యులేషన్ (లెక్కలు) మొదలౌతుంది. భారతదేశ జనాభా పెరిగిపోతుంది. అప్పుడు మనందరం ఏం తింటాం? ఇలాంటి లెక్కలు మొదలౌతాయి. అలా జరగదా? ఇది ఎలాంటిదంటే, సిమిలి (ఉదాహరణ) ఇవ్వనా?

పద్నాలుగు సంవత్సరాల కుర్రవాడు ఉన్నాడనుకోండి, అతని పొడవు నాలుగు అడుగుల నాలుగు అంగుళాలు, పద్ధెనిమిదవ సంవత్సరంలో అతని పొడవు ఐదు అడుగులు అయినట్లయితే, నాలుగు సంవత్సరాలలో ఎనిమిది అంగుళాలు ఎత్తు పెరిగితే, అతను పదిహేడవ సంవత్సరంలో ఎంత ఎత్తు పెరుగుతాడు అని లెక్కగట్టినట్లే, జనాభా గురించిన కాల్క్యులేషన్స్ కూడా చేస్తారు.

## పిల్లలకెందుకు చింత?

**ప్రశ్నకర్త:** నిర్దోషులైన పిల్లలకు శారీరక బాధను అనుభవించవలసివస్తుందా? దానికి కారణమేమిటి?

**దాదాశ్రీ:** నిర్దోషులైన పిల్లలకు శారీరక బాధను అనుభవించవలసివస్తుంది, అది చూసి వాళ్ళ మదర్‌కీ బాధ కలుగుతుంది. మౌలికంగా బాధ పిల్లలదేతే, ఆ బాధలో మదర్ కూడా భాగం పంచుకుంటుంది. అందుకే మదర్ దాన్ని చూస్తూ బాధను అనుభవిస్తుంది. చెయ్యటం, చేయించటం, అనుభవించటం ఈ మూడూ కర్మబంధం వలన జరుగుతాయి.

## మానవజన్మ మహత్తు

మానవ శరీరంలో ప్రవేశించిన తర్వాత, దేవ, తిర్యంచ, నరక గతులలోకి వెళ్ళి వచ్చిన తర్వాత, తిరిగి మనిషి శరీరం లభిస్తుంది. తిరుగాడే పనికి అంతం కూడా మనిషి జన్మ నుంచే జరుగుతుంది. మనిషి శరీరంలోకి వచ్చి జన్మను సార్థకం చేసుకోదలచుకుంటే మోక్షం ప్రాప్తిస్తుంది. అలా కాని పక్షంలో తిరుగాడే సాధనాలను పెంచుకోవచ్చు. అలా కూడా చేసుకోవచ్చు. ఇతర గతులలో కేవలం అందులోంచి బయటకు రావటమే ఉంటుంది. కానీ, ఇందులో రెండూ ఉంటాయి. విడుదలా అవవచ్చు, లేదా ఇంకా బంధాలలో చిక్కుకోనూవచ్చు. అందువలన, దుర్లభమైన మానవ జన్మ లభించిందంటే దాన్ని సార్థకం చేసుకో. అనంత అవతారాల ఆత్మ, దేహం కోసమే ఎంతో కాలం గడిపింది. అందులో ఒక అవతారాన్ని దేహం, ఆత్మ కోసం కేటాయిస్తే కార్యం నెరవేరుతుంది.

మానవ జన్మలో ఉన్నప్పుడు ఒకవేళ ఎవరైనా జ్ఞానపురుషుడు తటస్థపడితే, మోక్షం పొందేందుకు మార్గం లభిస్తుంది. దేవతలు కూడా మానవ శరీరంలోకి వచ్చేందుకు

ఆరాటపడతారు. జ్ఞానపురుషునితో భేటీ అయినట్లయితే, వైర్లు కలిసినట్లయితే, ఎన్నో జన్మలుగా శత్రువు పాత్రను పోషించిన శరీరం పరమ మిత్రునిగా రూపాంతరం చెందుతుంది. అంటే, ఈ దేహంలో ఉండగా మీకు ఒక జ్ఞానపురుషుడు లభిస్తే, ఆ అవకాశాన్ని పూర్తిగా వినియోగించుకో, వైర్లు కలుపుకొని, సరిహద్దులను దాటెయ్యి.

## జననమరణాలు లేనివాడి పునరాగమనం ఎక్కడి నుంచి?

**ప్రశ్నకర్త:** మరి పునరాగమనం చక్కర్లు ఏమిటి?

**దాదాశ్రీ:** అహంకారం ఉంది కదా, దాని పునరాగమనమే జరుగుతుంది. ఆత్మ తన మౌలిక దశలోనే ఉంది. అహంకారం సమసిపోతుంది కనుక అది కొట్టే చక్కర్లు ఆగిపోతాయి.

## ఇక మృత్యు భయం కూడా లేదు

**ప్రశ్నకర్త:** సనాతన శాంతిని సంప్రాప్తించుకుంటే దానివలన ఈ జన్మలోనేనా లేక జన్మజన్మాంతరాలలో కూడా ఉంటుందా?

**దాదాశ్రీ:** లేదు అది పర్మనెంటు అయిపోయింది. ఇక కర్త అనేవాడే లేడు కనుక కర్మబంధం ఉండదు. ఒకటి రెండు జన్మలలో మోక్షప్రాప్తి జరుగుతుంది. అందులోంచి విడుదలా లేదు, ముందుకూ నడవదు. మోక్షంలోకి వెళ్ళదలచుకోనివారికి ఇదంతా చేయటం అనవసరం. ఇందులో పడనేవద్దు. మోక్షం వద్దనుకునేవాళ్ళు ఈ లైన్‌లోకి రానేరావొద్దు.

**ప్రశ్నకర్త:** ఈ జ్ఞానమంతా వచ్చే జన్మలో గుర్తుంటుందా?

**దాదాశ్రీ:** అంతా అలాగే ఉంటుంది. ఏం మారదు. ఎందుకంటే, కర్మబంధం లేదు కనుక. అందువలన ఎటువంటి కష్టాలు కూడా ఎదురవవు.

**ప్రశ్నకర్త:** అంటే దీని అర్థం పూర్వజన్మలోని మన కర్మల కారణంగానే కష్టాలు కలుగుతున్నాయా?

**దాదాశ్రీ:** పూర్వజన్మలో అజ్ఞానంతో చేసుకున్న కర్మ బంధాలు, ఆ కర్మల ఎఫెక్టే ఇప్పుడున్నది. ఎఫెక్ట్‌ని అనుభవించవలసిందే. ఎఫెక్ట్‌ని అనుభవిస్తూ అనుభవిస్తూ, ఒకవేళ

జ్ఞానోదయం కలుగని పక్షంలో, మళ్ళీ కొత్త కాజెస్, ఫలితంగా కొత్త ఎఫెక్ట్స్ తలెత్తుతాయి. ఎఫెక్ట్ లోంచి మళ్ళీ కాజెస్ ఉత్పన్నమౌతుంటాయి, ఆ కాజెస్ తర్వాత జన్మలో ఎఫెక్ట్ ఇస్తాయి. కాజెస్ అండ్ ఎఫెక్ట్, ఎఫెక్ట్ అండ్ కాజెస్, కాజెస్ అండ్ ఎఫెక్ట్, ఎఫెక్ట్ అండ్ కాజెస్, కాజెస్ అండ్ ఎఫెక్ట్, అలా కొనసాగుతూనేవుంటుంది. అందువలన జ్ఞానిపురుషులు కాజెస్‌ని నిలిపివేసినట్లయితే, ఆ తర్వాత ఎఫెక్ట్‌ని మాత్రమే అనుభవించవలసివుంటుంది. దానితో కర్మబంధం అంతమైపోతుంది.

అందువలన జ్ఞానాన్నంతా గుర్తుంటుంది. అంతేకాక, అతను ఆ జ్ఞానస్వరూపుడైపోతాడు. ఇక అప్పుడు మరణ భయం కూడా రాదు. ఎటువంటి భయమూ ఉండదు. నిర్భయత్వం వస్తుంది.

## అంతిమ సమయంలో జాగృతి జీవిస్తున్నంతవరకు

**ప్రశ్నకర్త:** దాదాశ్రీ, జ్ఞానం పొందటానికి ముందు ఈ జన్మ కోసం ఉన్న కర్మబంధాలు అవి ఎలా సమసిపోతాయి?

**దాదాశ్రీ:** మనం జీవించివున్నంత కాలం, పశ్చాత్తాపంతో వాటి ప్రక్షాళన చేసుకుంటుండాలి. కానీ అవన్నీ సమసిపోకపోయినా, అవి బలహీనమై, వాటి ప్రభావం తగ్గుతూవస్తుంది. అవి బలహీనమవటం వలన, ఆ తర్వాత జన్మలో కొద్ది ప్రయత్నంతోనే వాటి బంధం వీడిపోతుంది.

**ప్రశ్నకర్త:** ప్రాయశ్చిత్తంతో బంధాలు వీడిపోతాయా?

**దాదాశ్రీ:** ఔను. వీడిపోతాయి. దూముడే అది. కర్మ ప్రాయశ్చిత్తం చేస్తూనే గట్టి ముడులు కాస్తా బలహీనపడిపోతాయి. క్షమాపణ కోరుకోవటంలో ఎంతో శక్తి వుంది. దాదా సమక్షంలో చేసినట్లయితే పని జరిగిపోతుంది.

## ఈ జ్ఞానం లభించిన తర్వాత మహావిదేహ లెక్కలు

కర్మ చేసే వత్తిడి వలన లభించవలసిన జన్మ ఎలాగూ లభిస్తుంది. ఒకటి రెండు జన్మల వరకు ఉండవచ్చు. కానీ, ఆ తర్వాత సీమంధర స్వామి చెంతకు వెళ్ళవలసిందే. ఇక్కడి

వత్తిడులు, ముందు నుంచే వెంట తెచ్చుకున్న ఋణానుబంధాలు, కొంత తగ్గివుంటాయి కదా అవన్నీ పూర్తవుతాయి. వేరే దారే లేదు.

**ప్రశ్నకర్త:** క్షమాపణ కోరుకుంటే కర్మ వత్తిడులు తగ్గిపోతాయా?

**దాదాశ్రీ:** తగ్గిపోతాయి కదా. త్వరలోనే పరిష్కరించబడతాయి.

## 'మేము' ఇలా చేసాము విశ్వం నుంచి నివారణ

క్షమాపణ కోరుకుంటూ కోరుకుంటూ, ఎన్ని అపరాధాలను అంతం చేస్తే, మోక్షానికి అంత దగ్గరౌతుంటారు.

**ప్రశ్నకర్త:** తర్వాత జన్మలో మళ్ళీ ఆ ఫైళ్ళు అంటుకోవు కదా?

**దాదాశ్రీ:** ఎందుకు? మనకి వచ్చే జన్మతో పనేంటి? ఇక్కడే ఇప్పుడే ప్రాయశ్చిత్తం చేసుకుంటూ వెళ్ళండి. ఖాళీ సమయం దొరుకుతూనే క్షమాపణ కోరుకుంటూ వుండండి. చందూ భాయ్‌తో మీరు, "క్షమాపణ కోరుకుంటూవుండండి" అని చెప్తే చాలు. మీ కుటుంబ సభ్యులతో మీకు ఇంతకు ముందు నుంచి ఏమైనా బాధ కలిగివుండవచ్చు. వాటన్నిటికీ మీరు క్షమాపణ కోరుకోవాలి. కొన్ని, లేక అసంఖ్యాక జన్మల నుంచి వస్తున్న రాగద్వేషాలు, చేసిన విషయ కషాయ దోషాలకు వాళ్ళ నుండి క్షమాపణ కోరుకుంటాను. ఈ విధంగా ప్రతిరోజు, ఒక్కో వ్యక్తిని, అలా ఇంటి సభ్యులందరినీ గుర్తుచేసుకుంటూ చేయాలి. ఆ తర్వాత దగ్గరివాళ్ళు, చుట్టుపక్కలవాళ్ళను తలచుకుంటూ చేస్తూనేవుండాలి. మీరు అలా చేస్తే మీలోని భారం తగ్గుతూవస్తుంది. అలాచేయకుండా ఊరకే భారం తగ్గదు.

మేము ఈ విధంగా విశ్వమంతటితోను నివారణ చేసాము. ముందు అలా చేయటం వలనే ఇలా ముక్తి కలిగింది. నా దోషాలు మీ మనసులో ఉన్నంత కాలం, నాలో ప్రశాంతతో జీవింతనీయదు. అంటే, మనం అలా క్షమాపణ కోరుకుంటే, అక్కడ అవి సమసిపోతాయి.

## చనిపోయినవారినీ క్షమాపణ కోరటం

**ప్రశ్నకర్త:** క్షమాపణ కోరుకునేవారు దేహం చాలించినట్లయితే మరి క్షమాపణ ఎలా కోరుకుంటాం?

**దాదాశ్రీ:** దేహం చాలించినవారి ఫొటో ఉన్నా, లేక వాళ్ళ ముఖం గుర్తున్నా చేయవచ్చు. ముఖం ఏమాత్రం గుర్తులేక, కేవలం పేరు గుర్తున్నా, ఆ పేరు చెప్పుకుని కూడా చేయవచ్చు చాలు. అది వాళ్ళకి చేరుతుంది.

**ప్రశ్నకర్త:** చనిపోయినవారిని క్షమాపణ ఎలా కోరాలి?

**దాదాశ్రీ:** మనసు, వాక్కు, శరీరం, భావకర్మ, ద్రవ్యకర్మ, నోకర్మ, చనిపోయినవారి పేరు, అతని పేరు మీదున్న సర్వ మాయకి భిన్నంగా, అలా ఆ వ్యక్తి శ్రద్ధాత్మను జ్ఞాపకం చేసుకోండి. ఆతర్వాత, "ఏయే తప్పులు చేసారో" వాటిని జ్ఞాపకం (ఆలోచన) చేసుకోండి. ఆ తప్పులకు నేను పశ్చాత్తాప పడుతున్నాను. వాటికి నన్ను క్షమించు (ప్రతిక్రమణ). అలాంటి తప్పులను మరెప్పుడూ చేయనని నేను దృఢంగా నిశ్చయించుకున్నాను. అలా నిర్ణయించుకోవాలి (ప్రత్యాఖ్యానం). మనం స్వయంగా చందూ భాయ్ జ్ఞానదృష్టిలో మెలుగుదాం. చందూభాయ్ ఎంత పశ్చాత్తాపపడ్డాడు, ఎంత బాగా చేసాడు, అలా ఎన్ని సార్లు చేసాడు అన్నవి తెలుసుకుందాం.

**-జై సచ్చిదానంద**

## అంతిమ సమయంలో చేసే ప్రార్థన

"హే దాదా భగవాన్, హే శ్రీ సీమంధర స్వామి ప్రభూ, నేను నా మనోవాక్కాయకర్మలతో .......................... ❖ (అంతిమ సమయం వచ్చినవారి పేరు, తన పేరు చెప్పుకోవాలి) .......................... ❖ పేరు మీది సర్వ మాయ, భావ కర్మ, ద్రవ్యకర్మ, నోకర్మ, పరమాత్మ స్వరూపులైన ప్రభూ, మీ చరణాలకు సమర్పిస్తున్నాను.

హే దాదా భగవాన్, హే శ్రీ సీమంధర స్వామి ప్రభూ, నేను మీ శరణకోరుతున్నాను. నాకు మీ అనన్య శరణు లభించుగాక! అంతిమ సమయంలో పక్కనే ఉండండి. నా వేలు పట్టుకుని నన్ను మోక్షం వైపు నడిపించండి. చివరివరకు నాతోనే ఉండండి.

హే ప్రభూ, నాకు మోక్షం తప్ప ఈ ప్రపంచంలో మరే వినాశకారి వస్తువూ వద్దు. నా మరుజన్మ మీ చరణాలలోనే, మీ శరణులోనే జరగాలి."

**"దాదా భగవాన్ నా అసీమ్ జయ జయకార్ హో"** అంటూవుండండి.

❖ అంతిమ సమయం వచ్చినవారు ఈ విధంగా ప్రార్థన చేయాలి.

(ఈ విధంగా ఆ వ్యక్తి మళ్ళీ మళ్ళీ అంటుండాలి. లేదా ఎవరైనా దగ్గరుండి అతని చేత అలా అనిపిస్తుండాలి)

---

## చనిపోయిన మనిషి కోసం ప్రార్థన

చనిపోయిన మీ సొంత వ్యక్తి లేక మిత్రుని కోసం ఈ విధంగా ప్రార్థన చేయాలి.

"దాదా భగవాన్ సాక్షిగా, శ్రీ సీమంధర స్వామి సాక్షిగా, దేహధారి ..................❖ మనోవాక్కాయకర్మల యోగం, భావకర్మ, ద్రవ్యకర్మ, నోకర్మలకు భిన్నంగా హే శ్రద్ధాత్మా భగవాన్, ................................ ❖ ఎక్కడున్నా, మీరు దయచేసి, అక్కడ సుఖశాంతులను, మోక్షాన్ని పొందేందుకు కృపచేయండి.

ఈరోజు మొదలు నాకు ............................. ❖ పట్ల రాగద్వేషాలు, కక్షలు కార్పణ్యాలు ఉంటే, అందుకు క్షమాపణ కోరుకుంటున్నాను. హృదయపూర్వకంగా పశ్చాత్తాపపడుతున్నాను. నన్ను క్షమించి, అటువంటి అపరాధాలు మళ్ళీ చేయకుండా ఉండే శక్తిని నాకు ప్రసాదించండి

❖ చనిపోయినవారి పేరు తలచుకోండి.

(ఈవిధంగా మళ్ళీ మళ్ళీ ప్రార్థిస్తుండాలి. ఆ తర్వాత చనిపోయిన వ్యక్తి ఎన్నిసార్లు గుర్తుకొచ్చినా, ఈ ప్రార్థనను చేస్తుండాలి)

## తెలుగులో దాదా భగవాన్ పుస్తకాలు

| | | | |
|---|---|---|---|
| 1. | అన్ని చోట్లా సర్దుబాటు | 6. | చింత |
| 2. | విభేదాలను తొలగించడానికి | 7. | నేను ఎవరు? |
| 3. | ఎలాగైనా జస్టిస్ జరిగింది | 8. | భావనతో మెరుగుపడతాయి జన్మ-జన్మలు |
| 4. | బాధితుడు తప్పిదము | 9. | మృత్యు సమయం, దానికి ముందు దాని తర్వాత... |
| 5. | క్రోధం | | |

❖ తెలుగులో మరిన్ని పుస్తకాలు జోడించబడుతున్నాయి మరియు త్వరలో అందుబాటులోకి వస్తాయి.

## Books of Dada Bhagwan in English

| | | | |
|---|---|---|---|
| 1. | Adjust Everywhere | 19. | Money |
| 2. | Ahimsa: Non-Violence | 20. | Noble Use of Money |
| 3. | Anger | 21. | Pratikraman |
| 4. | Aptavani-1 | 22. | Pure Love |
| 5. | Aptavani-2 | 23. | Right Understanding to Help |
| 6. | Aptavani-4 | | Others |
| 7. | Aptavani-5 | 24. | Science of Karma |
| 8. | Aptavani-6 | 25. | Science of Speech |
| 9. | Aptavani-8 | 26. | Shree Simandhar Swami : |
| 10. | Aptavani-9 | | The Current Living Tirthankar |
| 11. | Autobiography of Gnani | 27. | Simple & Effective Science of |
| | Purush A.M Patel | | Self-Realization |
| 12. | Avoid Clashes | 28. | The Essence Of All Religion |
| 13. | Brahmacharya: Celibacy | 29. | The Fault Is Of The Sufferer |
| | Attained with Understanding | 30. | The Guru and The Disciple |
| 14. | Death: Before, During & | 31. | The Hidden Meaning Of |
| | After… | 32. | The Practice Of Humanity |
| 15. | Flawless Vision | 33. | Trimantra |
| 16. | Generation Gap | 34. | Whatever Happened is Justice |
| 17. | Harmony in Marriage | 35. | Who Am I? |
| 18. | Life Without Conflict | 36. | Worries |

❖ Dada Bhagwan books are available in different languages: Gujarati, Hindi, English, Marathi, Telugu, Kannada, Oriya, Malayalam, Bengali, Punjabi, Assamese, Tamil, German, Spanish, Russian, etc.

❖ 'Dadavani' Magazine is published every month in three languages: Gujarati, Hindi & English.

# దాదా భగవాన్ ఫౌండేషన్ తెలుగు యూట్యూబ్ ఛానల్




❖ ఇది అడాలజ్ దాదా భగవాన్ ఫౌండేషన్ యొక్క అధికారిక తెలుగు యూట్యూబ్ ఛానెల్.

❖ దిగువ లింక్ నుండి తెలుగు భాషలో సత్సంగ వీడియోలను చూడండి.

**‘Dada Bhagwan Foundation Telugu’ Channel:**

https://dbf.adalaj.org/yttelugu

*Open Link OR*

*Scan QR*




---

*Dada Bhagwan Foundation Youtube video channels are available in other regional languages: Gujarati, Hindi, Marathi, Bengali, Tamil, Telugu, Kannada, Malayalam, Spanish, Portuguese, etc.*

# Persons to Contact

## Dada Bhagwan Foundation

**Adalaj** : **Trimandir**, Simandhar City, Ahmedabad-Kalol Highway
P/O: Adalaj, Dist. Gandhinagar - 382421, Gujarat, India.
Tel: +91-9328661166 / 9328661177
E-mail : info@dadabhagwan.org

**Mumbai** : **Trimandir**, Rushivan, Kajupada, Borivali (E)
Tel: +91-9323528901

| | | | |
|---|---|---|---|
| **Kolkata:** | 9830093230 | **Delhi:** | 9810098564 |
| **Jaipur:** | 9351408285 | **Chennai:** | 7200740000 |
| **Bhopal:** | 9425024405 | **Patna:** | 7352723132 |
| **Indore:** | 9039936173 | **Amravati:** | 9422915064 |
| **Raipur:** | 9329644433 | **Bangalore:** | 9590979099 |
| **Chandigarh:** | 9780732237 | **Hyderabad:** | 9989877786 |
| **Kanpur:** | 9452525981 | **Pune:** | 9422660497 |
| **Bhubaneswar:** | 8763073111 | **Jalandhar**: | 9814063043 |
| **Varanasi:** | 9795228541 | **Sangli:** | 9423870798 |

| | |
|---|---|
| **USA: Dada Bhagwan Vignan Institute**<br>Tel: + 1-877-505-DADA (3232)<br>Email: info@us.dadabhagwan.org | **U.K: Dada Darshan (UK)**<br>Tel: +44 330-111-DADA (3232)<br>Email: info@uk.dadabhagwan.org |
| **Germany** : +49 700 32327474<br>**UAE** : +97 1557316937<br>**Kenya** : +25 4722722063<br>**Dubai** : +971 501364530 | **Australia** : +61 421127947<br>**Singapore** : +65 81129229<br>**New Zealand** : +64 210376434 |

Website : www.dadabhagwan.org



అంతిమ క్షణాలలో ఆక్సిజన్ మీద ఉండి కూడా దరహాసం

## చేరుకునేది భావ స్పందన వరకే

చిన్న పిల్లలే కాని లేక తనవాళ్ళు ఎవరైనా చనిపోయిన తర్వాత వాళ్ళ గురించి చింతిస్తుంటే వాళ్ళు దుఖితులౌతారు. కనుక, జరగవలసింది జరిగింది అనుకుంటూ ప్రశాంత చిత్తంతో ఉండాలి. శోకించటం వలన ఎటువంటి ప్రయోజనమూ ఉండదు. ప్రపంచంలో జరిగేదంతా ఋణానుబంధమే అంటే ఇచ్చిపుచ్చుకునే ఖాతా. మరణం తర్వాత ఆ ఖాతా ఆ లెక్కలు అన్నీ సమాప్తమైపోయాయి. వాళ్ళు బాగా గుర్తుకువస్తుంటే మనం ఏం చెయ్యాలి? వీతరాగ భగవానుని, వాళ్ళకి శాంతి చేకూర్చమని ప్రార్థించాలి. మన భావన వాళ్ళకి తప్పక చేరుతుంది.

–దాదాశ్రీ



dadabhagwan.org




Printed in India

Price ₹30